

# విశ్వకళ్యాణ భాగవతము

(దృశ్య కావ్యము)





**డా॥ వెల్లంకి ఉమాకాంత శాస్త్రి**
ప్రొఫెసర్, గణిత శాస్త్ర విభాగము
ఇండియన్ ఇన్స్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజీ
ఖర్గపూర్, వెస్ట్‌బెంగాల్.

# SRI VISWA KALYANA BHAGAVATAMU

By : Dr. Vellanki Umakanta Sastry

ప్రథమ ముద్రణ : జూలై, 1994

ప్రతులు : 1000



**వెల : రూ. 30-00**

ముఖచిత్రం :
**ఎన్. కరుణాకర్, ఆర్టిస్టు**
H.No. S.R T. 301, సనత్‌నగర్
హైదరాబాద్ - 500 018
ఫోను : 310682.

ప్రతులకు :
**విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్**
4-1-435, విజ్ఞాన భవన్, బ్యాంక్ స్ట్రీట్,
హైదరాబాద్ - 500 001.

**విశాలాంధ్ర బుక్ హౌస్**
హైదరాబాద్, విజయవాడ, విశాఖపట్టణం, గుంటూరు,
తిరుపతి, హనుమకొండ, అనంతపురం, కాకినాడ.

**Dr. Vellanki Umakanta Sastry**
C 1 - 17, I.I.T. Campus,
Kharagpur - 721 302 (W B.)

ముద్రణ :
**పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్,**
1-1-517/బి/1, చిక్కడపల్లి ...,
గాంధీనగర్, హైదరాబాద్ - 500 380
ఫోన్లు : 611413, 600547.



శంఖ చక్ర గదా పద్మ వనమాలా విభూషితం
శ్రీ శేష శైల వాసంతం వెంకటేశం భజామ్యహ్యం.

This book is published with the financial assistance of Tirumala Tirupati Devastanams under their scheme 'Aid to publish religious books'.

# తొలి పలుకులు

మన దేశ చరిత్రలో చిరస్మరణీయమైనది శ్రీకృష్ణదేవరాయల కాలం. ఇది మన తెలుగువారికి స్వర్ణయుగం.

1509 - 1530 మధ్య కాలమున విజయనగర సామ్రాజ్యమును పరిపాలించిన రాజు శ్రీ తుళువ కృష్ణదేవరాయలు. వారి రాజ్యమున ప్రధానమంత్రిగా నున్న ధీశాలి సాళువ తిమ్మరుసు. రాయల యాస్థానమున అష్టదిగ్గజములవలె విలసిల్లిన మహాకవులు : అల్లసాని పెద్దన, నంది తిమ్మన, భట్టుమూర్తి (రామరాజ భూషణుడు), పింగళి సూరన, మాదయ గారి మల్లన, ధూర్జటి, తెనాలి రామకృష్ణుడు, అయ్యలరాజు రామభద్రుడు.

ఆ కాలంలో దేశ మంతా చిన్న చిన్న రాజ్యాలతో ఛిన్నాభిన్నంగా నున్నా, అలజడులూ, అరాజకాలూ, దండయాత్రలూ జరుగుతున్నా, రాయలూ, అష్ట దిగ్గజాలూ రసానుభూతికోసం, ఆత్మానందం కోసం, మనిషి మనిషిగా జీవించటం కోసం అనేక మహా కావ్యాలను మధురంగా వ్రాశారు.

రాయలు నిర్మించిన భువన విజయమను పేరు గల సభా భవనములో సాహిత్య, సంగీత, నాటక, నృత్య కార్యక్రమాలు అనేకము జరిగాయి. అట్టి సారస్వత కార్యక్రమాలను ఎందరో ప్రజలు విని, చూచి ఆనందించారు.

ఆంధ్ర సాహిత్యమునందలి ప్రత్యేక ప్రక్రియ అష్టావధానము. ఇందలి అంశములు : నిషిద్ధాక్షరి, న్యస్తాక్షరి, దత్త పది, సమస్య, వర్ణన, ఆశు కవిత, పురాణము, అసందర్భ ప్రసంగము (అప్రస్తుత ప్రశంస) అష్టావధానంలో, సాధారణంగా, ఒక కవి అవధాన మొనరించును. ఎనిమిది మంది పృచ్ఛకులు (ప్రశ్నించే వారు) పైన పేర్కొనిన ఎనిమిది అంశములలో ప్రశ్నించెదరు. ఇచటగల ముఖ్య

మైన నిబంధన - ఒక పృచ్ఛకుడు ఒక విషయములో మాత్రమే ప్రశ్నించవల యును. ఇట్టి ప్రశ్నలకు పద్యాలలోనో, మాటలలోనో అవధానం చేసే కవి సమయ స్ఫూర్తితో, రసమయంగా, చమత్కారంగా సమాధాన మిచ్చును.

శ్రీ విశ్వకళ్యాణ భాగవతము అను నీ నాటకంలోని పాత్రలు : రత్తి, రాయుడు, నారదుడు, మన్మథుడు, రాయలు, మహామంత్రి తిమ్మరుసు, అష్ట దిగ్గజాలు. ఇందు ఎనిమిది మంది కవులూ ఎనిమిది అష్టావధానములనూ, ఒకేసారి, రాయల వారి కొల్వులో అత్యద్భుతముగా నొనరింతురు. అష్టావధాన పరంపర యందలి అసందర్భప్రసంగము ద్వారా నాటకము నందలి పాత్రల పాత్ర చిత్రణ సముచితముగా నొనర్చుట జరిగినది.

'విశ్వ శ్రేయః కావ్యం' అను నార్యోక్తి ఈ దృశ్య కావ్య రచనకు ప్రేరణ నిచ్చినది. అట్టి సుధామయోక్తులను నుడివిన ఆర్యులకు నమస్సుమాంజలు లర్పించుచున్నాను

నాటకరచన విషయమున ప్రోత్సాహము నిచ్చిన మిత్రులు - డా॥ మేడసాని మోహన్, డా॥ సి.ఆర్.ఎస్. పిళ్ళై, డా॥ వై. పైడారావు గార్లను ప్రశంసిస్తు న్నాను. ఈ కావ్యాన్ని ఆసాంతం విని ఆనందించిన శ్రీ బాలంరాజు కృష్ణంరాజు గారిని, శ్రీ ఊటుకూరు శ్రీనివాసరావుగారిని అభినందిస్తున్నాను.

ఈ గ్రంథ ప్రచురణకు వలసిన ద్రవ్యసహాయము నొసంగిన శ్రీ తిరుమల తిరుపతి దేవస్థాన అధికారులకు కృతజ్ఞతా పూర్వక ధన్యవాదముల నర్పించు చున్నాను.

గ్రంథ ప్రచురణ విషయమున సముచితమైన సలహాలను, సహకారమును ఒసంగిన శ్రీ వాకాటి పాండురంగరావు గారిని, శ్రీ ఫణిహారం వల్లభాచార్య గారిని మనఃపూర్వకముగా నభినుతిస్తున్నాను. కోరిన వెంటనే ఒప్పుకొని ముఖ పత్ర చిత్రాన్ని రమణీయంగా విరచించి యిచ్చిన శ్రీ ఎన్. కరుణాకర్ గారి ప్రజ్ఞను కొనియాడుచున్నాను.

ముద్రణను శ్రద్ధతో నొనర్చిన పద్మావతీ ఆర్టు ప్రింటర్సు వారి యోపికను మెచ్చుకొనుచున్నాను. ముఖచిత్రమునకు సంబంధించిన బ్లాకును తయారు చేసిన మోహన్ ప్రాసెస్ వారికి, ముఖచిత్రమును ముద్రించిన శ్రీ బాలాజీ ఆర్టు ప్రింటర్సు వారికి నా ధన్యవాదములు.

ఈ కావ్య రచనా కాలములో సహకరించిన నా భార్య శ్రీమతి వేదవల్లిని, నా కుమార్తె చి॥ లలితను హృదయపూర్వకముగా ఆశీర్వదించుచున్నాను.

సహృదయులు, రసజ్ఞులూ అయిన పాఠకులు, ఈ కావ్యమును ఆపాంతమునూ చదివి, ఆనందింతురని నమ్ముచున్నాను పండితులు, నీరక్షీర న్యాయంబున, ఈ కావ్యమునందలి దోషములను పరిత్యజించి గుణగ్రహణ మొనర్తురని ఆశించుచున్నాను.

ఈ దృశ్య కావ్యమును నాటకముగా ప్రదర్శింప దలచినవారు ప్రస్తావనను, కవులకు సంబధించిన విస్తృతమైన వివరములను, పురాణగాథలను వదలిపెట్ట వలయును. అప్పుడు ఇదియొక మనోహరమైన పద్యనాటక మగును.

ప్రదర్శింపదలచినవారు దయచేసి రచయితకు తెలియపరచగలరు.

హైదరాదాద్
4-7-1994

ఇట్లు
వెల్లంకి ఉమాకాంత శాస్త్రి

---

మా ఇంటి అడ్రసు :

డా॥ వెల్లంకి ఉమాకాంత శాస్త్రి
ప్లాట్ నం. 36, ప్రశాంతి నగర్,
డాక్టర్ ఎ.ఎస్. రావు నగర్ వద్ద,
ఇ.సి.ఐ ఎల్. పోస్టు, హైదరాబాద్-500 762. A.P.

| పాత్రలు | గుర్తులు |
| --- | --- |
| రత్రి | ర |
| రాయుడు | రా |
| నారదుడు | నా |
| మన్మథుడు | మ |
| కృష్ణదేవరాయలు | కృ |
| తిమ్మరుసు | తి |
| పెద్దన | పె |
| భట్టుమూర్తి | భ |
| నంది తిమ్మన | న |
| ధూర్జటి | ధూ |
| అయ్యలరాజు రామభద్రుడు | అ |
| మాదయగారి మల్లన | మా |
| పింగళి సూరన | పిం |
| తెనాలి రామకృష్ణుడు | తె |

# శ్రీ విశ్వకళ్యాణ భాగవతము

శ్రీకర పార్వతి సుత సుర
లోక నుతా విఘ్నరాజ లోకేశ్వర య
శ్లోక కృపాంభోనిలయా
నీ కరుణ నవిఘ్నమస్తు నిరతము నాకున్.

శ్రీ రంజిల్లెడు రాజతాచలముపై చెల్వంబు మీరంగ లో
కారాధ్యుండు మహేశ్వరుండు మది నాహ్లాదంబుతో తాండవ
శ్రీరీతిన్ నటియింప గౌరి మధుర స్మేరంబుతో లాస్యమున్
ప్రారంభింపగ నాడి పాడెదు నినున్ ప్రార్థింతు విఘ్నేశ్వరా.

ఉదయాచలము పైన నొప్పారు రవి బోలు
ముఖమండలము తోడ పొల్పుమీరి
భీకర గంభీర శ్రీకర రూపాన
మేరు భూధరమును మించి వెలసి
రణశాస్త్ర నవ వ్యాకరణ శాస్త్ర పాండిత్య
గరిమతో లోక విఖ్యాతి గాంచి
వినయ విధేయతా ఘనతర సౌశీల్య
సద్గుణ సంపత్తి సరణి మించి

వనధి నవలీల దాటి రావణుని లంక
యందు సీతమ్మనుంగాంచి యామె మాట
రాము చెవి వేయు మారుతి రమ్యమైన
కవన శక్తిని నాకిచ్చి కాచు గాత.

SVB-1

జనన మరణాలు చక్రమై సంచరింప
అఖిల లోకాల సృజియించి యాది పాడు
అమ్మముగురమ్మలకు మూలమైన తల్లి
కనకదుర్గమ్మ నాకిచ్చు గాత కవిత.

మనసున పుట్టు భావముల మంజులమైన పదాళి బల్కని
స్వనముల సంతరించి శృతి శాస్త్ర పురాణములన్ సృజించి సొం
పొనరగ గీత నాట్యముల నూహలతో పచరించి మించు నా
జనని పదాలరాణి నను చల్లగ చూచెడుగాత నిచ్చలున్.

కనుల గాంచిన యట్లు కమనీయముగ రామ
కథ వ్రాసె వాల్మీకి కవి వరుండు
పంచమ వేదము బ్రహ్మ చెప్పినయట్లు
భారతమ్మును వ్రాసె వ్యాస సుకవి
భక్తి కల్పద్రుమ ఫలములు వెలయింప
భాగవతము వ్రాసె వ్యాస మౌని
కాళి పాదాంభోజ గళిత మరందమౌ
కావ్యత్రయము వ్రాసె కాళిదాసు

భారవియు మాఘుడును రెండు భవ్య కావ్య
ములను వ్రాసిరి యిట్టి యపూర్వ దివ్య
కవి వతంసుల పాదపంకజము లేను
కొలుతు వారలు నాకు వాక్కుల నొసంగ.

రుచిరార్థ సూక్తుల పచరించి నన్నయ్య
భారతామ్నాయమ్ము వ్రాసె కొంత
శిల్పమనల్పమై చెలగ నంతట కొంత
తిక్కనకవి వ్రాసె నక్కజముగ
శేష భాగంబును శేముషి మెరయంగ
వెఱ్ఱన పూరించె నింపు మీర
తనవారలకు నిట్లు తనివార తెనుగున
ధర్మార్థ కామాది తత్వమెల్ల

తేటపద మ్రాసి యిద్ది పూదోట యిటకు
మధుపములు వోలె రారండు మధువు గ్రోల
ననుచు నెలుగెత్తి పిలిచెడు ఘనుల కేను
కేలు మోడ్చెద కవితలో చాలునెరుగ.

శివభక్తి రక్తితో చిత్తమ్ము హత్తగా
సోమనాథుండూగె సొంపు మీర
గంగాధరుని దివ్యగంగ యుప్పొంగగా
శ్రీనాథకవి పల్కు చిందులాడే
మా పాల గలవాడు మాధవుడనుచును
నాచన సోమన నాట్యమాడె
పరువెత్తి భక్తుల కరుణతో హరికాచు
నంచు పోతన భక్తి పంచి యిచ్చె

ఇటుల మన తెలుగు నేలలో నీశ్వరుండు
హరియు నొకచోట నాట్యము నాడినటుల
పల్కులను బల్కి సుధవార్ధి పరువులెత్తు
రీతి చేసినవారి నర్చింతు నేను.

తిమ్మన కవితలో సొమ్ములౌ ముద్దుల
పలుకుల దలతును పదములందు
జిగి బిగి యొప్పగా చెప్పిన పెద్దన
ముచ్చట నెంచెద మోద మెసగ
శబ్దార్ధముల పైన సర్వాధికారమ్ము
నెరపిన భట్టు సంబరము దలతు
పదగుంభనమ్ముతో పలుకు తెనాలి రా
ముని మానసము నెంతు ఘనత మీరు

తెనుగు నా భాష భాషల తెనుగ లెస్స
అనుచు బలికిన యాంధ్ర భోజుని మహాత్మ
కృష్ణరాయల నూహింతు కృతి రచింప
రమ్య కవితను నాకు బిరాన నీయ.

గానామృతమ్ముతో కవితలల్లిన త్యాగ
రాజన్నమయ్యల రవళి నెంతు
చెలువుగా కవితను చెప్పిన వేమకూ
ర్వెంకన్న పదముల పొంక మెంతు
ధీశక్తి కవిత వారాశి పొంగించిన
తిరుపతి వేంకటేశ్వరుల దలతు
వాల్మీకి కవియె శబాషని పల్కగా
కనుగొన్న విశ్వనాథను భజింతు

ఎందరెందరో మహితాత్ము లీ ధరా త
లమ్ముపై పుట్టి తెనుగమ్మ రొమ్ము పట్టి
అమ్మ పాలీయమని త్రావి కమ్మనైన
కవిత పలికిరో వారల గణుతి సేతు.

ఛందమ్ము విడినను చందమందము వీడి
పలుకాద వలదు శుభమ్ము గోరి
గుండెలో నుండెడు మండు నగ్ని రగిల్చి
వదలగా వలదు దవానలముగ
భావ సుస్వర లయ బద్ధము గాకున్న
కవితలు విన సొంపు కావు వినుడి
అక్షరరమ్యత యమలమౌ రూప సా
క్షాత్కారము రసము గణ్యమైన

ధ్వని యలంకార వస్తు సంపదలు మనకు
పూర్వు లిచ్చిరి యద్దియే పూర్వ పుణ్య
ఫలము తెలియుడి పలుకుడి భద్రమైన
దారి ప్రజలెల్ల నడువ నుదార బుద్ధి.

ఇవ్విధంబున దేవతాస్తవంబును సుకవి ప్రశంసయు గావించి ఆత్మ నాలోచించి భవిష్యత్కవులకు మార్గము సూచించి కావ్యరచనా కుతూహలుండనై యున్న నా మనస్సునకు పరమాత్మ చరాచరము లన్నింటి యందునూ

తానున్ననూ, చరాచర బాహ్యంబుగానున్న యప్పరమేశ్వరుని పద పంకజాత సంస్తుతియవ్వాని దర్శన భాగ్యంబూహా సదనంబున లభించునంతవరకు నొనర్పక కమనీయమైన కావ్య వస్తువు కనిపించుట దుర్లభంబని తోచె. అంత నేను 'కలౌ వెంకట నాయకః' అను నార్యోక్తిదలంచి, కలియుగంబున ధర్మ సంరక్షణకు వెంకట నగాగ్రముపై వెలసిన వెంకటేశ్వరుని స్మరించుటయే కర్తవ్యమని యెంచి స్తవంబొనరింప నారంభించితి.

దర్శింపనీయరా తావక రూపమ్ము
కనులార నేగన వనజనాభ
వినిపింపనీయరా వినుతమౌ నీనామ
మోంకార రవముతో పంకజాక్ష
స్తుతియింప నీయరా దురిత విధ్వంసమౌ
నీ గుణమ్ములు రమ్యరాగ రవళి
అర్చింపనీయరా యంతట నుండియు
వెంకటాగ్రముపైన వెలయు నిన్ను
అనుచు నా స్వామి పదముల నంతరంగ
మందునిల్పి సమంచితమైన భక్తి
రక్తి పెనగొన గళమెత్తి రసమయముగ
ధ్యానమొనరించితిని కావరాయటంచు.

అంత దృగ్గోచరంబయ్యె నమరవరులు
అందరును వెంకటనగాగ్రమందుచేరి
విశ్వకళ్యాణమును గూర్చ వేడ్కచేయు
హరి సిరుల పెండ్లి వైభవమద్భుతముగ.

కొలువున రత్నపీఠమున కూర్చొని నవ్వులు మోముపైన వె
న్నెల వలె దోచ పార్శ్వమున నీటుగ పీఠములందు చేరి మం
గళకర గీతికా చయము గానము చేయు కవీంద్ర పంక్తికిన్
సలుపుడి సద్విధానమని స్వామి వచించిన యట్లు గాంచితిన్.

ఏమిది కృష్ణరాయ ధరణీశుడు సత్కవి కుంజరాళికిన్
ప్రేమతొ చెప్పినట్లు పచరించును సప్తగిరీశు డిట్టి యీ
కామిత మబ్జనాభునకు కల్గెనె యంచు తలంచుచుండగా
నా మది దోచె కావ్యమొక నాటక రీతిని వ్రాయుమన్నటుల్.

కావ్యము దేవదేవు పద కంజములన్ జనియించు నిద్ధి సం
భావ్యమటంచు నెంచుతరి పావన జీవన రమ్య గంగయే
దివ్య రసానుభూతి జగతీస్థలి పర్వులు పెట్టెనో యనన్
నవ్యముగా మనంబున వికంబడె నాకధునీ తరంగముల్.

ఇద్ది జనముల మనముల నిరుకుసేయు
అడ్డుగోడలగూల్చు ప్రజాంతరంగ
జ్యోతి వెలిగించు నంతట ద్యోతకమగు
విశ్వ కళ్యాణమని వింటి వీనులలర.

స్వామి నా దృశ్య కావ్య మాసాంత మిపుడు
చూచు నని స్వాంత మందున దోచుచుండ
మనసు నందున బొడమిన మధురమైన
భక్తి భావమ్ము తోడుత బల్కితిటుల.

కనుమయ్య నా కావ్య కన్యక సరళమౌ
మాటలు బల్కెడు మధురవాణి
వినుమయ్య నా తల్లి వేవేల విధముల
లాస్య మాడ గలట్టి రమణి గౌరి
చూడు మయ్యా బిడ్డ సుందరాలంకార
శోభిత మౌ లక్ష్మి శుభ చరిత్ర
నవ భావముల తోడ నవ రసమ్ముల తోడ
వరిఢవిల్లెడు నట్టి బాల యిద్ధి

తిరుమల నగాన వెలసిన దేవదేవ
హరిహర బ్రహ్మరూపమై యలరు నీవు
నాదు కృతికన్య జేపట్టి యాదరించి
అంకితమ్ముగ గొనుము శ్రీ వేంకటేశ.

అని యర్థించి, యా స్వామి తథాస్తు అని యన్నట్లు భావనాలోకంబున నాలోకించి యంతట శ్రీ విశ్వ కళ్యాణ భాగవత రచన కుపక్రమించిరి.

## నాంది

శ్రీ రమాపతి గుణాలయ శౌరీ
పాపహారి వరదా మురారీ ॥శ్రీ॥

సరస మోహన వేణు వినోదా
సారస లోచన భవ విమోచన
దీన జనావన పరమ పావన
గోపి విలోల తాపస పాలా
కాపాడ నీ పాదయుగ సేవ దేవా ॥శ్రీ॥

శ్రీ వెంకటేశ్వర నాటక మండలికీ .... జై
శ్రీ వెంకటేశ్వర నాటక మండలికీ .... జై
శ్రీ వెంకటెశ్వర నాటక మండలికీ .... జై.

శ్రీ రమ కన్ను సన్నల వసించి సమస్తము సంతరింప శృం
గారము శాంతమున్ కరుణ కన్నులలో దులకించు బీబినాం
చారియు మంగమాంబయు నజస్రము సౌఖ్యముగూర్చ జీవనా
ధారుడు వేంకటేశ్వరుడు తత్పరతన్ ధర నేలు గావుతన్.

# ప్రస్తావన

(తెర తీయుదురు దేవురికార్డునుండి పాట వినిపిస్తూ ఉంటుంది. పాట వింటూ హుషారుగా రత్తి అద్దం ముందు నిల్చొని తలలో పూలు తురుముకుంటూ ఉంటుంది.)

సరసాలు లేనియింట ఓ మామ
సిరితల్లి నిల్వదంట ॥స॥

కురిసిన విరులవాన గుండెల్లో పొగలు రేప
వెచ్చనైన కౌగిట్లో గ్రుచ్చిన మగనితోడ
ఉన్నవారి గుండెల్లో ఉన్నాడు దేవుడు
కన్నులున్న వారికి కనిపించు నాతడు ॥స॥

మగడున్న మగువ సంపెగ పూవువంటిది
ఏ తుమ్మెదైన దాన్ని ఎన్నడూ ముట్టదు
సోకు చూసి కన్నుగీటి పోకిరోడు వెంటబడితే
మక్కెలిరగ తంతాడు మనువాడినోడు వాణ్ణి ॥స॥

ర : అయిదింటికొస్తా నన్నోడు అద్దమురేతయినా వచ్చేటట్లు లేదు. ఏమయిందో ఇయ్యాళ ఈడికి.

(రాయుడు హుషారుగా ప్రవేశించును.)

రా : రత్తోయ్! వచ్చేశాను. ఇదుగో మల్లెపూలు తెచ్చా.

ర : అప్పుడనంగా వస్తానన్నోడివి ఇప్పుడా రావటం? ఇంతదాకా గుడిసె ముందు నిల్చొని ఎప్పుడొస్తాడా అని ఎదురు చూస్తుండా. అయిదింటికొస్తానన్నోడివి ఏడిపించి ఏడిపించి ఏడింటికొచ్చావు.

రా : అయిదు ఏడు ఈ లెక్కలన్నీ ఏంది! మనమెప్పుడైనా లెక్కసూసి పెట్టుకున్నామేమిటి? నూరు సొంత కొట్టునోడికి సొంత పెళ్ళామున్నోడికి తీరికలేని పని.

ర : ఓ సోసి సరసం సాల్లే. సినిమా కెళదామని నే సెపితే ఐదింటికి రాకుండా ఇప్పుడొచ్చి చిత్ర చిత్రంగా చతర్లాడుతున్నావు

రా : ఈనాడు మనం చూడబొయ్యేది చిత్రమైన నాటకమే. విశ్వభారతి కళా నిలయంలో వెంకటేశ్వర నాటక మండలి వాండ్లు ఏస్తున్నారు. చూడు టిక్కట్లెత్తుకొచ్చా. సోకు చేసుకో, త్వరగా పోదాం.

ర : నిజమా మామా!.... నాతోడు?

రా : ఇయిగోనే టిక్కట్లు, ఎట్టి మొగమా!

ర : నాటకం పేరేంది మామా?

రా : విశ్వకల్యాణ భాగవతమట.

ర : మన సిన్నప్పుడు తిరణాలలో సూసిన ఈధి భాగవతం లాగా ఉంటుందా మామా!

రా : ఏమోనే సదువుకున్నోళ్ళు సదువుకోనోళ్ళు టిక్కట్ల కోసం ఎగబడు తుంటే సూసొచ్చా.

ర : ఎవరు మామా నాటకం రాసింది?

రా : నాటకం సూడటానికి ముందే నీవిట్లా వాయిస్తావనే, ఈధి సివర గుడి దగ్గరున్న బాపనయ్యను కనుక్కోనొచ్చా. అందుకే ఆలస్యమైంది. ఈ నాటకం రాసింది డాక్టర్ వెల్లంకి ఉమాకాంతశాస్త్రి కవియట.

ర : డాక్టరంటే వైద్యుడే! అయితే ఆయినక్లె ఆ నాటకం హరీ అన్నట్లే.

రా : ఆయన కదేదో బిరుదే. చేస్తున్న ఉద్యోగం ఒక పెద్ద చదువు చెప్పే పెపంచకపు బడిలో అయ్యోరి పని.

ర : ఆట్లగా. అయితే సరే చెప్పు. ఈ నాటకంలో వేషాలేమేమెస్తాయ్?

రా : కృష్ణరాయలు రాజు. మంత్రి తిమ్మరుసయ్య. కవులు ఎనిమిది మంది.

ర : తెల్లోళ్ళు రాకముందు, చాలాకాలం క్రితం మనదేశాన్ని పాలించిన తెలుగు రాజు, తెలుగు మంత్రి- వారికదేనా?

రా : అవును. రాయలు గొప్ప సదువుకున్నోడట. కవట. ఆయన దగ్గర ఎనిమిదిమంది కవులు కొలువు సేశారట. ఆయన మంత్రి తిమ్మరుసు ఎంతో గొప్ప బుఱ్ఱ ఉన్నోడట.

ర : మరి కవులు, కవులో?

రా : మొదటివాడు అల్లసాని పెద్దన.

ర : పెద్దనంటే పెద్దమనిషా? అల్లసాని ఆయన ఉంపుడుగత్తె పేరా?

రా : పెద్దాయనే. బాగా గొప్పగా కవిత్వము చెప్పేవాడట. పరాయి ఆడ దాన్ని బజారున పోతున్నా కన్నెతి చూసేవాడు కాడట. ఆయన కవిత్వం అల్లిక గజిబిజితో అదే జిగిబిగితో వయసులోనున్న సానిదాని లాగా ఉండేదట. అందుకోసం ఆయన యింటిపేరు అల్లసాని అయిందట.

ర : మరి రెండోవాడు?

రా : రెండవవాడు దూరి.... దూరి.... ధూర్జటి.

ర : ఏందా పేరు మామా? ఎక్కడైనా దూరి చెడ్డాడేమిటి?

రా : అట్లనమాక. కళ్ళు బోతాయ్. ఆయన మహా శివభక్తుడు. ఇంట్లో భార్య తంటాలకోరు, జగడాలమారి అట. ఆమె పోరు పడలేక ఎక్కె సాని గడప, దిగే సాని గడప. ఏదో సేశాడట కవి, రసికుడు, ఉప్పుతిన్న ప్రాణం ఊరుకుంటుందా?

ర : అంతేలే, సేసేయి శివ పూజలు. దూరేయి దొమ్మరి గుడిసెలు. నీవు మాత్రం.... కొంగున ముడేసుకున్నాను గాబట్టి సరిపోయింది. లేకపోతే నీ రంగూ తెలిసేది.

రా : మూడవవాడు అయ్యలరాజు రామభద్రుడు.

ర : ఆయనా రాముడిలాంటి వాడేనా?

రా : అందర్నీ గురించి ఆరాలు తీయమాక, తొందరగా కూడుదిని పోకపోతే, ఆ నాటకం మనం యిక్కడే సూడాల్సి వస్తుంది.

ర : మరి నాలుగో కవో?!

రా : పింగళి సూరన.

ర : పింగళి, మంగలి ... పింగళి, మంగలి.

రా : నిజంగానే నీ బుజ్జ గొప్పదే! నే సెప్పకుండానే తెలుసుకున్నావు. రాయలోరి కాలంలో కొందరు హాస్యానికి పింగళి సూరనను ఆయన చాటున మంగలి సూరన అని పిలిచేవారట. ఆయన ఎంతో గొప్ప కవి. రెండర్థాలూ ఒకే పద్యంలో వచ్చేటట్లు ఆయన రామాయణాన్ని, భారతాన్ని ఒకే పుస్తకంగా వ్రాశాడట.

ర : మామా! ఆ కాలంలోగూడా అంత గొప్పోళ్ల అట్లా హాస్యం చేసేవాండ్లా?

రా : ఏదో సరదాకు అట్లా అన్నా, కల్పించి కథలు చెప్పటంలో ఆయనంత గొప్ప కవి ఇంకొకడు లేడని అంతా అనుకుండేవారట. తర్వాత సెబుతా విను. అయిదో కవి నంది తిమ్మన.

ర : ఏం, బాగా లావుగా కోతిలాగా ఉంటాడా ?

రా : ఆయనకు ముక్కు బాగా పొడుగట. అందుకోసం వాండ్ల పెద్దవాండ్లు ఆయనకు ముద్దుగా తిమ్మన అని పేరు పెట్టారట. ఊరంతా ఆయనను ముక్కు తిమ్మన అని పిలిచేవారట. ఆయన ఎంతో ముద్దు ముద్దుగా కవిత్వం చెప్పేవాడట.

ర : అవునులే. ముక్కు పొడుగున్నోడు ఎక్కడైనా ముద్దు పెట్టుకోగలడు. అందువల్ల చెప్పుంటాడులే.

రా : ఆయన ముందు సరసంగా ఎవరయినా పద్యం చెబితే, ఆయన దగ్గర ఏ వస్తువుంటే ఆ వస్తువును యిచ్చేవాడట. ఎవరో ఒక పల్లెవాడు ఆయన దగ్గర పద్యం చెబితే చెవి కుండనాలు తీసిచ్చాడట.

ర : కర్ణుడిలాంటోడన్నమాట !

రా : ఆరో కవి రామరాజు భట్టు. అతను భట్రాజు కులంవాడు రాయలవారి కొలువులో చేరిన తరువాత అతను సెప్పే కవిత్వంలో ఉన్న అందాలు, అతను పెట్టుకుండే సొమ్ములు చూసి అతనిని రామరాజభూషణుడు అని కొంతమంది పిలిచేవారట. కొంతమంది భట్టుమూర్తి అని పిలిచేవారట.

ర : ఏడో కవి ?

రా : మాచయగారి మల్లన.

ర : ఇతడు కూడా శివభక్తుడేనా ? ధూర్జటిలాంటి వాడేనా ?

రా : శివభక్తుడే. కవిత్వం చెబితే రసం పొంగేటట్లు చెప్పాలె, లేకపోతే ముంగాలె ముడుచుక కూచోవాలి అనేవాడట. తెలుగింటి ఆడకూతురి పెండ్లిని తెగ మెచ్చుకొని కవిత్వం రాశాడట, ఎనిమిదోకవి ఎవరో చెప్పుకో సూద్దాం.

ర : ఆ ఏముందిలే మామ తెనాలి రామలింగడై ఉంటాడు, కనుక్కోమన్నావు గాబట్టి సెప్పగలిగా. ఎన్నోసినిమాలల్లోసూశాగదా!ఎంతగానోనవ్విస్తాడు. మామా! వాడి పేరు గుర్తుచేసికుంటేనే గొల్లుమని నవ్వొస్తుంది. మామా! తెనాలి రామలింగకవి కూడా మంది కొంపల్లో తొంగున్న బాప్తేనా?

రా : అదే. విను చెబుతా. రాయలోరు రసికులు కదా! ఆయన పప్పులో కాలేస్తే రాజ్యం ఎక్కడ పాడవుద్దో అని రామలింగం కవే సానిబజారుకు రాత్రిపూట కాపలాగా వెళ్ళేవాడట ఆది సూసి అంతా అనుకుందేవారట, అందమైన భార్య నింట్లో బెట్టుకొని అయ్యోరి కిదేం పొయ్యేకాలం వచ్చింది అని.

ర : తాటి చెట్టుక్రింద నిల్సొని పాలు తాగినా కల్లే అనుకుంటారు మామా! రాత్రిపూట నీవు తొమ్మిదింటిదాకా కొట్టునుంచీ రాకపోతే ఏ పిట్టను పట్టాడో అని అనుకుంటాను

రా : త్వరగా కూడెట్టు. అన్నీ కానిచ్చుకోని పోదాం.

ర : ఆ నాటకంలో అంతమంది కవులున్నారు గదా! వాళ్ళు పద్యాలు పాడితే మనకర్థ మవుతాయా?

రా : ఆ భయమేం లేదట లేవే. మధ్య మధ్యలో మాటలు గూడా సరసంగా ఉంటాయట.

ర : ఏమో మామా! అర్థమైన చోట నవ్వేస్తాను. అర్థంగాలేదనుకో, అంతా నవ్వుతున్నారనుకో. నీవు హుషారుగా ఈలెయ్ నేను గలగల నవ్వేస్తాను.

రా : రత్తోవ్! త్వరగా కట్టుకోవే సుక్కల సీరె. సూసొద్దాం రంజైన నాటకాన్ని.

ర : మామా! ఇదివరకు మన మొకసారి ఎంకి పాటలను విన్నప్పుడు నా పేరైన రత్తాలను రత్తిగా, నీ పేరైన సుబ్బారాయుణ్ణి రాయుడిగా ముద్దుగా మార్చుకున్నాం కదా! ఈసారి ఈ నాటకం సూస్తే ఏం జేస్తామో!

రా : కానియ్యవే, ఎఱ్ఱిమొగమా! రత్తికాస్తా రక్తి అయిపోతుంది. రాయుడు కాస్తా రాములు అయిపోతాడు.

(తెర పడును)

## మొదటి రంగము

(తెరలో)

శ్రీవార్ధి కన్య రమణా
జీవన పాథోధి తరణ సృష్టిస్థితి సం
భావన కార్య ధురీణా
దేవా శ్రీ వెంకటేశ తిరుమల వాసా.

వారిజ సంభవుండు చెలువంబుగ బొమ్మలనెల్ల జేసి యిం
పారగ ప్రాణమున్నొసగ నమ్మ సరస్వతి బుద్ధి వాక్కులన్
తీరుగ వారికీయ జగతీ స్థలి రంగముగాగ జేసి యం
భోరుహ నాభుడాడెడి యపూర్వపు నాటకమిద్ది చూడుడీ!

(మన్మథుడు రంగస్థలముపై నుండును. నారదుడు ప్రవేశించును.)

నా : నారాయణ! నారాయణ!

నారాయణా హరి నారాయణా
వారిజ నయనా పన్నగ శయనా ॥నా॥

కారుణ్య సాగర నారాయణా
కమలా మనోహర నారాయణా ॥నా॥

గోవింద మాధవ హే ముకుంద
భావజ జనకా పరమానంద
నంద నందనా వందిత మునిజన
బృందావన వాసా లోకేశా ॥నా॥

సరస మురళిరవ లోల గోపాల
సాధు భక్తజన జీవన పాల
గరుడగమన త్రిజగజ్జన పూజిత
కరిరాజ వరదా నారద సేవిత ॥నా॥

నారాయణ.

మ : మునీంద్రా! అభివాదనము, ఎచ్చటనుండి మీరాక?

నా : లోక సందర్శనా కుతూహలముతో బ్రహ్మలోకమునుండి బయలుదేరి, వైకుంఠమును, కైలాసమును దర్శించితిని. అంత నా మనస్సునకు మహర్షుల కాలవాలమై మహోన్నత ప్రాచీన సంస్కృతితో విరాజిల్లు భారతదేశమును చూడముచ్చటకల్గెను వచ్చితిని హిమవత్పర్వతమునకు. దర్శించితిని మహేశ్వరుడు తపం బొనర్చిన పర్వత శృంగమును. కాంచితిని కన్నులకు కట్టినయట్లు పార్వతీ పరమశివుల కల్యాణము. నా జన్మ ధన్యంబయ్యె. ఉత్తుంగ తరంగయగు గంగ యందు స్నాన మొనర్చితి. ఆనందముతో నగస్త్యుడు దాటిన వింధ్య పర్వతమును దాటితిని. మన్మథా! త్వరలో మరలి వచ్చెదను.

మ : ఏమాతొందర? ఒక్క నిముషమాగుము. ఇది విజయనగరము. ఇచ్చట రాజాధిరాజ రాజ పరమేశ్వర బిరుదాంకితుడైన శ్రీకృష్ణదేవరాయల పరిపాలనలో ప్రజలు పొందే రసానుభూతిని ఒక్కసారి కన్నుల గాంచి పొమ్ము.

నా : నాకెందులకు బ్రహ్మచారిని. ముక్కు మూసుకొని, ఏ సంసారలంపటయూ నెరుగక పరమాత్మ ధ్యానములో కాలము గడుపువాడను. ఆ రంజు, ఆ రసాస్వాదన, కుట్ర వాడవు, విషయవాంఛాకారకుడవు, జగన్మంగళ కరుడవు నీవనుభవించుము.

మ : ఇదివరకొకసారి మునగ చెట్టెక్కించి నా దుంప తెంచితివి. మరియొకసారి ఏమి చేయబోవుచున్నావో - తెలియకున్నది.

నా : పార్వతీ పరమశివుల కళ్యాణ సమయమున నీ వొందిన భంగపాటు జ్ఞప్తికి వచ్చుచున్నదా?

మ : తగిలిన దెబ్బలను మరచిపోదునా స్వామీ? మీరు వినిపించిన సతీ పరమ శివుల దైన్య గాథకు కరిగిపోయి, పార్వతినీ పరమేశ్వరునీ లోక కళ్యాణము కొరకు ఒకటిగా చేయవలచి యుద్యమించిన నాకు జరుగవలసిన పరాభవమే జరిగినది.

జనని పార్వతి తపమును కనిన నాకు
మనసు కరిగెను శంకరు మనసు మార్చి
వారి గూర్పగ నెంచితి ఘోరమైన
పాఠమును నేర్చుకొంటి ఈ పగిది నుంటి.

సరస విహీనుడు పరమ కోపిష్ఠియునైన పరమేశ్వరునిపై బాణములు విసురుట నా తప్పు. అందుకే జరుగరానిదేదియో జరిగి పోయినదని భావించుచూ, మనస్సు ప్రశాంతముగా నుండుటకై మహా కవులు వ్రాసిన కావ్యములను చదువుకొనుచున్నాను. అయిననూ లోక కళ్యాణముకొరకు అనారతము లీలా వినోదము తేలియాడు మా అమ్మా నాన్నలను చూచువాడనగుటచే, ఊరకుండలేక కాలక్షేపమున కేదియో చేయుచుందును.

నా : మన్మథా! నా మాట వినుము.
తలచును లోకమాత మది తల్లడమందుచు పెండ్లినాటి మా
టల వినుమయ్య మాకయి కటా మరుడెంతటి బాధ నందె నా
వలపురేని రూపమును వాని హొయల్ చెలువంబు మారె వి
హ్వలమగు శంకరున్ గదియ బాపురె నాటికి నేటి కంచులోన్.

కందర్పా! యథార్థము నెరుంగుము. పరమేశ్వరుడు ముక్కంటి తాండవము చేయుచూ పైకి దర్పము చూపించునే కాని లోపల పట్టిబోళాశంకరుడు. భక్త వశంకరుడయిన శంకరుని సంగతి నీకు తెలియనిదా? ఆయనపై కోపముంచుకొనుట నీవంటి లోకజ్ఞునకు తగదు. నేను

ఎప్పుడు కైలాసమునకు కేగిననూ నిన్ను గురించి ఎంతగానో ప్రశ్నించును- 'నాయనా, నారదా! మన్మథుడు నాకంటికి మరల కనిపించుట లేదు. వాడెచటనున్నాడు? వాని కోపము తగ్గినదా?' అని.

మ : చాలులే స్వామీ! మళ్ళీ ఆయన కంట బడమందువా! ఈ జన్మకిక వద్దు.

నా : మదనా! ఈ విషయమును సావధానముగా వినుము. మందర పర్వతమును కవ్వముగాను వాసుకి యను సర్పమును తాడుగాను చేసి దేవతలు, రాక్షసులు క్షీరసాగరమును మధించుచుండిరి. అందుండి పుట్టిన హాలాహలము లోకములను కాల్చుటకు సంసిద్ధమయ్యెను. అప్పుడు భయభ్రాంతులైన దేవదానవులు పరుగులెత్తిరి. మీ నాన్న మందర పర్వతము పడిపోకుండా కచ్ఛపరూపమెత్తి మోయుచుండెను. అట్టి తరి ఆయన పరమశివుని తలంచెను. అంతట శివుడు ఆ హాలాహలమును మ్రింగి, తనలో నున్న లోకములు భస్మము కాకుండుటకై దానిని కంఠగతము గావించుకొనెను. ఆ హాలాహలము వలన పుట్టిన యుష్ణమువలన శివునకు ప్రాణము పోవునంత పని యయ్యెను. అంత శ్రీ మహావిష్ణువు 'సురగంగ యుద్భవమై ప్రశాంతముగా ప్రవహించుగాత' యని పల్కెను. అట్లుద్భవమైన గంగను శిరముపై ధరించిన ఈశ్వరునకు పోయిన ప్రాణము తిరిగి వచ్చినట్లయ్యెను. ఈ విధముగా శివకేశవులు సకల లోక కళ్యాణము కొరకు ఒకరి కొకరు సహాయ మొనర్చుకొనువారు. శివునికేకష్టము వచ్చినను విష్ణువు చూచి యూరకుండ లేడు. విష్ణువుకే కష్టము వచ్చినను శివుని పనియు నంతే. వారి అన్యోన్య ఆశ్రయమును అవగాహనను చూచియే మహర్షులు శివుడే విష్ణువనియూ, విష్ణువే శివుడనియూ ధ్యానించు చున్నారు. అందువలన శివుని నిందించిన విష్ణువును నిందించినంతయే.

మన్మథా! మరియొక సంగతి.

ఆ ఈశ్వరుని కోపం వలన జరిగిన ఆ ఘటన వలననే, వారికి కన్నబిడ్డలు లేక పెంపుడు బిడ్డలను పెంచుకొనుచున్నారు. గతమును వదలిపెట్టుము, ప్రకృతమునకు రమ్ము. సప్తగిరులపై వెలసి నిత్య కళ్యాణము పచ్చతోరణముగా విరాజిల్లు స్వామికి బ్రహ్మోత్సవములు జరుగుచున్నవట. మరలెందరో అచటికి ముందుగానే పరుగులెత్తిరి. నేను ఆ

సమయమున కచటకు వెళ్ళవచ్చునుకే అని రాత్సారము చేసితిని. ఇక నన్నాపకు మన్మథా! నా మనస్సు శ్రీ వెంకటేశ్వరుని పద్మావతిని దర్శింప తహ తహలాడుచున్నది.

మ : ఆగవయ్యా మహాత్మా! వింటివా ఆవేదనాదములను? మీ నాన్న పల్కిన నాలుగు వేదములను పుక్కిట పట్టిన భూసురులు స్వస్తి వచనంబులు పల్కుచున్నారు. ఆలకించితివా ఆ విపంచికా రవములను? అచ్చట మీ మాతృ స్వరూపులైన విద్వాంసులు వీణ వాయించుచున్నారు. వినుమా మృదంగ ధ్వనులను, ఆ వేణు రవములను, ఆ గజ్జల గలగలలను. అచ్చట దేవేంద్ర లోకముననున్న అప్సరస్త్రీలగు రంభా, ఊర్వశీ, మేనక మొదలైనవారలను తలదన్నగల నర్తకీ మణులు నాట్యము చేయు చున్నారు. అచట నెన్నోరకముల వేడుకలు జరుగుచున్నవి. ఎవ్వరికేది కావలయునన్న ఆ సభకే వెళ్ళ వచ్చును. ఈనాడు రాయల యాస్థానమౌ భువన విజయమున సాహిత్య గోష్ఠి జరుగనున్నది. అందు మహా విద్వాంసులు, అఘటనా ఘటనా సమర్థులు, సమయస్ఫూర్తి ప్రజ్ఞాధురీణులు, శారదా మూర్తులు అయిన అష్ట దిగ్గజములు అవధానము చేయబోవుచున్నారు. వారి కవితా ప్రక్రియలోని వైవిధ్యము చూచి యానందించ వలసినదే!

నా : వ్యాసుడు, వాల్మీకి, కాళిదాసు మొదలైన మహాకవుల కవితలు విన్న నాకు ఇందంత విశేషమేమియు కన్పించుట లేదు.

మ : అదేమి అటులందువు? నిన్నొక ముఖ్య పాత్రగా జేసి తిమ్మనయను కవి పారిజాతాపహరణమను కావ్యమున వ్రాసెను. అందు సత్యభామ శ్రీకృష్ణుని ఎడమ కాలితో తన్నినది. అయిననూ ఆ పరమాత్మ, ఆ సరసుడు 'నా శరీరం తగిలి నీకాలు నొచ్చిందా? సత్యా!' అన్నాడు. తిమ్మన వర్ణించిన శృంగారము కన్నుల పండువుగా నున్నది.

నా : ఇదంతయు నేకావించిన గోలయేలే. ఒకప్పుడు మీ నాన్నగారిని సందర్శింప పాల సముద్రమున కేగితిని. ఆయన నిద్రించుచుండెను. మీ యమ్మ

గారు ఆయన పాదములఁ బట్టుచుండెను. 'ఏమమ్మా! ఆడు వారి గతి భర్త పాదముల చెంత పడియుండుట యేనా?' అని అడిగితిని. అది ఆమెకు బాధ కలిగించెను. అట్టి సమయమున మేల్కొనిన శ్రీమహా విష్ణువు, నేనన్నమాటలు విన్నాడేమో 'నారదా! కయ్యములు బెట్టకుము. స్త్రీలు పురుషులు అన్ని విషయములందునూ సమానులే. అవసరమును బట్టి అప్యాయతతో నానందము కొరకు చెరియొక పనిచేసి జీవింతురు' అని ఉపన్యసించెను. అంత నేను 'మగవారు తన్నినను స్త్రీలు ఊరకొను చున్నారు. ఆడువారు తన్నిన మగవారు ఊరకొనెదరా? స్వామీ!' అని ప్రశ్నించితిని. అంత స్వామి 'అవసరమునకు అన్యోన్య దాంపత్యమునకు అదియూ చేయవలసి వచ్చును' అనిరి. అటులనే కావచ్చునేమోయని అటనుండి సెలవు తీసికొంటిని. ద్వాపరయుగమున స్వామివారు కృష్ణావ తార మెత్తినపుడు లక్ష్మి స్వరూపిణియైన రుక్మిణీదేవికి నాకునూ ఆ విష యము జ్ఞప్తికున్నది. పరమాత్మను పట్టి చూడవలయునని ఒక ఆట ఆడితిమి. ఆ నాటకము మేము చేసిన పనే. కానీ పరమాత్మయే నెగ్గెను. సత్యభామ ఎవరో తెలుసునా? ఆదిశేషుని అవతారము. 'ప్రతి నిత్యము స్వామి నాపై పవళించుచున్నాడు. ఆయన యొడిలో నేను పరుండు భాగ్యమెట్లు కల్గు'నని తలంచి విష్ణువును కోరెను. ఆయన అనుగ్రహమున శేషుడే సత్యభామగా జనియించెను.

మ : నీకు తెలియని సంగతి, నీవు వేలుబెట్టని చోటులేదు గదా?

నా : అవును మన్మథా! ఏమి చేయమందువు? మా యింట నించుకేనియు ప్రశాంతత లేదు. మా నాన్న శ్రావ్యముగా వేదబుక్కులు వల్లించుకొనుచూ క్షణమునకొక బొమ్మను సృష్టించి ప్రాణమును బోయుచుండును. మా యమ్మ శాస్త్ర విషయములను చర్చించుకొనుచూ, సంగీత సాహిత్య ములతో వినోదించుచూ ప్రతి బొమ్మకునూ మనస్సును సంతరించును. మా నాన్న రూపురేఖలు అందచందములు ఇచ్చిన మనిషికి మా యమ్మ మట్టిబుద్ధి నిచ్చును. మా యమ్మ మహితమైన జ్ఞానమొసగిన మా నాన్న అట్టి ప్రాణిని అనాకారిగా చేసివైచి వాని తలవ్రాత వక్రముగా వ్రాయును. మా యమ్మా నాయనా ఉభయులు పండితులే! అయిననూ వారిద్దరికినీ ఏనాడునూ శృతి కలియదు. అందువలననే, ఎన్నడో అరుదుగా అంద

చందములు కలవాడు తెలివి తేటలున్నవాడు సృష్టింపబడుచున్నాడు. ఆ ఆలుమగలకు అన్యోన్యత లేకుండుట చేతనే లోకమున మా నాన్నకు పూజా పునస్కారములు లేకుండా పోయినవి. నాకు ఇంత ప్రశాంతత లేకనే ముల్లోకములనూ తిరుగుచున్నాను.

మ : అవును స్వామీ, నీ పురాణము. ఇచ్చట జరుగబోవు కవితాగోష్ఠిలో రసాస్వాదన మొనర్చెదము రమ్ము.

నా : ఏమి రసాస్వాదనో! పరబ్రహ్మ బ్రహ్మోత్సవములు రేపు ప్రారంభ మగును. ఈ రాత్రికిచ్చటనే యుండిన కన్నుల పండువుగా నా యుత్స వములను చూడగలనో లేదో అనుసందియము కలుగుచున్నది.

మ : నీకెందుకు, ఆ ఏర్పాటు నేజేయింతును గదా! రేపు నేను కూడా వత్తును. ఈ రాత్రికిచట భువన విజయమున అష్టదిగ్గజముల అష్టావధానమును తిలకించి పోదము రమ్ము. ఈ యష్టావధానమున కవులొనర్పబోవు వర్ణనలు, ఆశుకవితలు అమోఘము. ఇందొక కవి యక్షరముల నిషే ధించుచుండ మరియొక కవి రసవత్తరముగా పద్యము చెప్పుట గణ నీయము. దత్తమైన పదములను, న్యస్తమైన అక్షరములను ఉంచి సులువుగా మనోహరముగా కవులు పద్యములు చెప్పుదురు వారి కవితా వైచిత్రి చూడవలసినదే! అది ఆది శేషునికైనను అబ్బురమనియే అని పించును. రాయలవారిచ్చు సమస్యలను కవిరాజులు రమణీయముగా మృదుమధురముగా పూరింతురు. అచ్చటి కవుల పురాణ పఠనా వైచిత్రి వీనులకు విందొనగూర్చును హాస్యరస భరితము, పాండిత్యప్రకర్షా నిక షోపలము, తర్కోపతర్క సందిగ్ధము అయిన అసందర్భ ప్రసంగము విని యానందించవలసినదే. దేవతలు రాక్షసులు సముద్రమును మథించగా జనించిన యమృతమును మా నాన్నగారు సకల దేవతలకూ పంచి యిచ్చిరట! అట్టి యమృతము మనకు దొరకుట కష్టమగుచున్నది గదా! అందువలన ఈనాడు జగన్మోహనముగా శ్రీ కృష్ణ రాజేంద్రుని సభా మండపమున జరుగు నవధానమందు సావధానముగా కవితా మృతమును గ్రోలుదము రమ్ము. మనకన్నా ముందుగానే బ్రహ్మో త్సవమునకు వచ్చిన దేవతలందరూ అచ్చట పోగు గా వచ్చును. త్వరగా పోదము, రమ్ము.

(ఇరువురూ నిష్క్రమింతురు. తెర పడును.)

## రెండవ రంగము

( తెరలోనుండి వినిపించును. )

శ్రీమన్మహా రాజాధి రాజ, రాజ పరమేశ్వర, సర్వ సర్వం సహా చక్రనిర్వహణ దురీణ శ్రీశ, దుర్గానదేశ, సాహితీ సమరాంగణ సార్వభౌమ, ఆంధ్ర గీర్వాణ కవిబ్రహ్మ, ఆంధ్రభోజ, అఖిల దిగ్వ్యాప్త యశశ్చంద్ర చంద్రికా విభ్రాజ, అరివీర భయంకర చండమార్తాండ, మూరురాయరగండ, నరస నాయక పుత్ర, లోకత్రయ స్తోత్ర, వీర రసావతార, దానగుణ గణ గంభీర కల్పద్రుమాకార శ్రీకృష్ణదేవరాయ **మహారాజులకు బహుపరాక్ బహువరాక్ బహుపరాక్!**

( తెర తీయుదురు )

( రంగస్థలము రాయల కొల్వు భువన విజయము. మధ్య వేంక టేశ్వర స్వామి నిలువెత్తు విగ్రహము లేక వర్ణచిత్రము. ఎడమ ప్రక్కన వరుసగా రాయలు, పెద్దన, ధూర్జటి, రామభద్రుడు, సూరన, కుడి ప్రక్క తిమ్మరుసు, నంది తిమ్మన, భట్టుమూర్తి మల్లన, రామలింగకవి ఆసీనులయి యుందురు. )

తి : మహారాజులకు ఆశీస్సులు; కవి వతంసులకు దండ నాయ కులకు, పౌరులకు, రసజ్ఞులకు, సభాసదులకు, ఆబాల గోపాలమునకు స్వాగతము సుస్వాగతము.

మన కవులు ప్రబంధ రచనతో నూతన యుగము సృష్టించిరనుట నిర్వివాదాంశము. నవరస భరితములైన అల్లసాని పెద్దన మనుచరిత్ర, హరికథా సారము; ధూర్జటి కాళహస్తీశ్వర మాహాత్మ్యము, కాళహస్తీశ్వర శతకము; అయ్యలరాజు రామభద్రుని రామాభ్యుదయము; పింగళి సూరన కళాపూర్ణోదయము, రాఘవ పాండవీయము, ప్రభావతీ ప్రద్యుమ్నము; నంది తిమ్మన పారిజాతాపహరణము, వాణీ విలాసము; భట్టుమూర్తి వసు చరిత్ర, హరిశ్చంద్ర నలోపాఖ్యానము; మాదయగారి మల్లన రాజశేఖర చరిత్ర; తెనాలి రామకృష్ణుని పాండురంగ మాహాత్మ్యము, ఉద్భటారాధ్య

చరిత్ర - ఇవన్నియు జగద్విఖ్యాతములు; శారదా సతి కంఠసీమ నలంక రించిన రత్నమణిమయ సువర్ణహారములు.

మహారాజు శ్రీకృష్ణదేవరాయలు నిండు యవ్వనము నెలకొనక మున్నే రచించిన మదాలస చరిత్ర, సత్యా వధూ ప్రీణనం, జాంబవతీ పరిణయం, సకల కథా సార సంగ్రహము, జ్ఞాన చింతామణి, రసమంజరి యను సంస్కృత కావ్యములు రాయల వైదుష్యమును కళాపిపాసను చాటుచున్నవి. మన రాజు తెనుగున వ్రాసిన ఆముక్తమాల్యద వారికి మన దేశముపైన, మన భాషపైనను, మనపైనను గల అపారమైన మక్కువను చాటుచున్నవి అక్షరములు రానివారు పదముల విలువ తెలియని వారు ఈ దేశమున నుండరాదని రాయలవారి అభ్యర్థనము, శిరోధార్య శాసనము.

ఇయ్యది మనకు పర్వదినము. ఈనాడు మన ఆస్థానమున నున్న ఈ ఎనిమిది మంది మహాకవులు అష్టావధానము గావింతురు. ఒక్కొక్కరూ ప్రత్యేకముగా చేయుట నిదివరకు మీరు ఎన్నియో మారులు చూచియున్నారు. ఈనాడట్లుగాక ఎనిమిది మందియు కలసి ఎనిమిది యష్టావధానముల నొనరింతురు. చూచి ఆనందింప మిమ్ముల నందరనూ కోరుచున్నాను ఈ సభ విశ్వకళ్యాణకరమై విలసిల్ల భగవం తుని ప్రార్థించుచున్నాను. ప్రారంభించండి పెద్దన కవీంద్రా!

పె : కృష్ణరాయా!

కన్నులు కల్వలై ఎసగ కంఠము కంబుకమున్ హసింప మేల్
పున్నమి చందమామ సరిపోలెడు మోమలరార ప్రేమతోన్
వెన్నుని వక్షమందు కడు వేడుకతో విలసిల్లు లక్ష్మియా
యన్నుల మిన్న కృష్ణ వసుధాధిపు నిచ్చలు కాచు గావుతన్.

కన్నులు కలువల వలె, కంఠము శంఖమున కన్న మిన్నగా, ముఖము పూర్ణిమ నాటి చంద్ర బింబము వలె ఒప్పారుచు విష్ణువు వక్ష స్థలంలో ఉండే లక్ష్మీదేవి, స్త్రీలల్లో కెల్లా ప్రశస్తమైన తల్లి, కృష్ణ రాయలను ఎల్లప్పుడూ రక్షించుగాక.

తి : (మల్లినతో) ఇచ్చితిరి గదా రాయలవారు గండ పెండేరము. ఇంకనూ ఏమి కావలయునో పెద్దన కవీంద్రులకు! లక్ష్మీదేవి స్తవముతో రాగములు తీయుచున్నారు.

పె : (గంభీరముగా) రాయల వారి పరిపాలనలో రాజ్యమున ధర్మము నాల్గు పాదములతో కామధేనువై నడచుచున్నది. కర్షకుల శ్రమతో బంగారము అన్ని భూములలోను పండుచున్నది. రాయలవారు రసహృదయులు. నాకేమిచ్చినను ఇవ్వవచ్చును.

తి : ప్రభూ! వినండి.

మృదు మధురంబుగా సుధయమేయముగా కురియంగ శారదా
సదమల మూర్తిగాత్రమున శ్రావ్యముగా నవరాగమాలికా
పదముల పాడుచున్ తన విపంచి పయిన్ పలికించుచున్ నవా
భ్యుదయము కృష్ణరాయ నరపుంగవ నీకని పల్కుగావుతన్!

ఓ నరశ్రేష్ఠుడైన కృష్ణరాయా! మృదువుగా మధురముగా అమృతమువలె గాత్రమున శ్రావ్యముగా నూతనమైన రాగములతో కూడు కొన్న పాటలను పాడుచూ, వాటిని వీణపయి పలికించుచూ ఉండు స్వచ్ఛమైన రూపముగల సరస్వతీదేవి నీకు శుభోదయము అని పలుకు గాత.

సం : సంగీతాన్ని సాహిత్యాన్ని మేళవించి భట్టుమూర్తి కవి పసందుగా చెప్పారు. నా పద్యాన్ని వినండి మహారాజా!

ఒక చెలి మోవి తేనెగొనె యొక్కతె చెక్కిలి ముద్దు గొంచు వే
రొక జవరాలి కౌగిట సుఖోన్నతి బొందుచు హాయి హాయిగా
సకల చరాచర ప్రతతి సంతస మందగ వేణువూదు స్వా
మి కమలలోచనుండు నిను మిన్నగ గాచుత కృష్ణ భూవరా!

ఓ కృష్ణరాయా! ఒక చెలిని పెదవులమీద, ఒక చెలిని చెక్కిలి మీద ముద్దు పెట్టుకొనుచూ, మరొక చెలిని కౌగిలించుకొనుచూ సుఖాన్ని పొందుతూ, ప్రకృతి అంతా పులకించేటట్లు వేణుగానం చేసే కృష్ణ పరమాత్మ నిన్ను రక్షించు గాత.

మా : తిమ్మన కవిగారు మనోహరంగా తమ సహజమైన ముద్దు పల్కులతోనే చెప్పారు.

నం : ఎదుటి వారి కవితలో నున్న రసమయ భావాన్ని సహృదయతతో ఒప్పు కొనుటంలో నాకన్నా మీరు మిన్న అని ఏనాడో అంగీకరించాను. మల్లన కవి నా మాటను కాదనరనుకుంటాను.

మా : చిన్నవాడను. మీ మాటను దాటగలనా?.... నా పద్యాన్ని వినండి ప్రభూ!

తన మేనన్ సగపాలు గౌరి సతికిన్ తాదాత్మ్యతన్నిచ్చి గం
గను శీర్షమ్మున ప్రేమ దాల్చి సుర రక్షా దీక్షతన్ కిల్బిష
మ్మును కంఠాన భరించి సంతతము సమ్మోదమ్ముతో నొప్పు పా
వనుడీశుండు శుభాల మీకిడుత దేవా కృష్ణరాయాధిపా!

ఓ కృష్ణరాయా! తన శరీరంలో సగభాగాన్ని పరవశంతో పార్వతీదేవికిచ్చి, ప్రేమతో గంగను శిరముపై ధరించి, దేవతలను రక్షించుట కొరకు విషాన్ని కంఠంలో భరించి ఎల్లప్పుడూ సంతోషంతో ఉండే టటువంటి పవిత్రమైన వాడైన ఈశ్వరుడు మీకు శుభాల నిచ్చుగాత!

దూ : పరమేశ్వరుని భవ్యముగా గోరితిరి. ఆయనే నిజముగా లోక కళ్యాణము కోరువాడు. ప్రభూ! అవధరించండి.

సురుదసురుదనియు చూడక శంకరా
పాహీయనంగనే పలుకువాడు
కులమత భేదాల తలపుతో నెన్నక
కరుణతో నర్థుల గాచువాడు
మాయయు మర్మమ్ము మదిలోన నుంచక
పరతత్వ రూపుడై పరగువాడు
అఖిలాండకోటి బ్రహ్మాండమ్ము నందున
నటియింప నేర్చిన నాట్యకాడు

సకల జగములలోన విశ్వాస పాత్ర
మైన సర్వేశ్వరుండు మీ పైన కరుణ
నలరి యిచ్చుత పుత్ర పౌత్రాళి మీకు
కృష్ణరాయ ధరిత్రీంద్ర కీర్తిసాంద్ర!

ఓ కృష్ణరాయ ప్రభూ! దేవతలు రాక్షసులు అని భేద బుద్ధితో చూడక, పాహీ అనగానే పలికేవాడు, కులమత భేదాలను మనస్సులో పెట్టుకొనక కరుణతో అడిగిన వారి కోర్కెలను తీర్చేవాడు, మాయా మర్మము మనస్సులో నుంచుకొననివాడు, ప్రపంచంలోనున్న జీవజాలములో నున్న దానికన్నా అతిరిక్తమైన రూపం కలవాడు, సకల జీవకోటియందు నాట్యం చేయ సమర్థుడైన నాట్యకారుడు, సమస్త లోకములలో నమ్మదగిన వాడు, సర్వాన్ని తన అధీనంలో నుంచుకొన్న వాడైన ఈశ్వరుడు మీకు పుత్రులను పౌత్రులను ఇచ్చుగాక.

పిం : ఈశ్వర భక్తియే ముక్తికి సోపానమా ధూర్జటి కవీంద్రా! అయిన వినుడు.

తొలి జననమ్ము నందు తన తోచిన యట్టుల జేసి బూదియై
మలిభవమందు కొండ హిమ మందిర మందునబుట్టి యోర్పుతో
తలకొని యీశుగొల్చి సుకృతంబున నర్ధశరీరమంది ని
చ్చలు సుఖియించు గౌరి నిను సాకుత కృష్ణ నరేంద్ర చంద్రమా!

ఓ కృష్ణరాయ ప్రభూ! మొదటి జన్మలో సతీదేవి, భర్త వద్దంటున్నా వినకుండా దక్షయజ్ఞానికి వెళ్ళి, అవమానాగ్నితో దగ్ధమై బూడిదయై మరుసటి జన్మలో చల్లగా ఉండే మంచుకొండయైన హిమవంతుని యింటిలో పుట్టి, ఉమా వద్దు వద్దు అంటున్నా వినక పట్టుదలతో ఈశ్వరుణ్ణి కొలిచి పూర్వజన్మ సుకృతంతో ఆయనలోని అర్ధ శరీరమై ఎల్లప్పుడూ సుఖాన్ని పొందే పార్వతి మిమ్ములను తల్లివలె లాలించుగాక.

అ : కథా కల్పనా చాతురీ ధురీణుడైన పింగళి సూరనకవి కమ్మగా తమ ముందొక కావ్యాన్నే ఉంచారు ప్రభూ!

కృ : ఈ యాస్థానమున పాండిత్యమున, కవిత్వమున నెవరు తక్కువ? అందరూ సరస్వతీ మూర్తులే! కవిబ్రహ్మలే! మీ కవిత్వాన్ని వినిపించండి రామభద్ర కవీ!

అ : వినండి ప్రభూ!

భూసుత సిగ్గుతోడ తన పున్నెముపండె నటంచు చూడ ఏ
మీ సురుడెవ్వరంచు మిథిలేశుడు బుద్ధి దలంప రావణుం
డాశల నాడెపీడ సభయంతయు నద్భుతమంది చూడ నా
ఈశుని విల్లు ద్రుంచు కమలేశుడు రాముడు మిమ్ము కాచుతన్.

సీత సిగ్గుతో తన అదృష్టం పండింది అని చూస్తున్నది. ఎవరీ దేవతామూర్తి అని జనక మహారాజు ఆశ్చర్యపోతున్నాడు. రావణాసురుడు శ్రీ మహావిష్ణువు ఆవిర్భవించాడు, నా పని అయిపోయినట్లుంది అని అనుకున్నాడు. సభలోని రాజులందరూ ఏమీ అద్భుతము అని చూస్తున్నారు. అట్టి సమయంలో శివధనస్సును భంగం చేసే శ్రీరామచంద్రుడు మిమ్మలను రక్షించుగాక.

తె : రామభద్రకవీ! ఈ పద్యము మీ రామాభ్యుదయం అనే కావ్యంలోనిది కాదుగదా!

అ : కాదయ్యా మహాప్రభో రామలింగకవీ! అనుమానం ముందుపుట్టి తరువాత మీరు పుట్టారు. ఆ తరువాత హాస్యం పుట్టింది. ఇది నా కావ్యం రామాభ్యుదయంలోనిది కాకపోయినా రాముని అభ్యుదయాన్నే చెబుతుంది.

తె : మహాప్రభూ! మనసుంచి నా పద్యాన్ని వినండి.

పెలుచన్ వారిద పంక్తి గూర్చి జగముల్ భీతిల్ల నాఖండలుం
డిలపై పోసెడు గ్రావ వర్షమునకున్ హేలాగతిన్ వ్రేలితో
వలగోవర్ధన మెత్తి గోపకులమున్ హర్షాన రక్షించు నా
జలజాక్షుండిల నేల మీ కొసగుతన్ శౌర్యంబు రాయాగ్రణీ.

ఓ కృష్ణరాయప్రభూ! ఆగ్రహంతో ఇంద్రుడు మేఘాలను ప్రోగుజేసి రాళ్ళవర్షము కురిపిస్తూ ఉండగా, అవలీలగా వ్రేలితో గోవర్ధన పర్వతాన్ని ఎత్తి గోపకులాన్ని రక్షించే ఆ కృష్ణపరమాత్మ ఈ సమస్త ధరాతలాన్ని పరిపాలించటానికి కావలసిన శౌర్యాన్ని మీ కిచ్చుగాక.

ధూ : అంత భారాన్ని మోస్తున్న ఆ పరమాత్మ పయిననే ఈ భారాన్ని కూడా పెడుతున్నావా, రామలింగకవీ?

తె : ఏ భారాన్ని మొయ్యకుండా గాలికి తిరిగేవాడు ఏమిస్తాడు ధూర్జటి కవీంద్రా?

పె : మీకిద్దరికి ఒక్క క్షణం ప్రశాంతంగా ఉండ బుద్ధి కాదు గదా!

కృ : మహా కవులారా! మహదానందంగా కవిత్వం చెప్పారు. ఇక అవధాన ముఖ్యాంశాలలోనికి వద్దాము.

తనర నిషేధాక్షరి మీ
ఘనతర పాండిత్య శక్తి కవితాయుక్తుల్
పెనగొనసేయుడి సభికులు
విని సంతసమంద నో కవీశ్వరులారా!

భ : పెద్దన కవీంద్రా! శకుంతలను చూచిన దుష్యంతుని హృదయంలో కలిగే భావాలను సుందరంగా ఒక పద్యంలో చెప్పండి. ఆ పద్యంలో కచటతప, గజడదబ అను పది అక్షరాలూ ఉండరాదు

పె : మహారాజా! వినండి.
సుర భామిని మణియో భువి
వరలు వనశ్రీయొ సూనవల్లరియో ఈ
సరసీరుహ నయన ననున్
మరుశరముల సేయు మనసు మరిమరి నొవ్వన్.

తి : భట్టుమూర్తి కవి పెద్దనగార్ని ఒక పట్టు పట్టి చూచారు.

కృ : ఆయనకీ యుద్ధమొక లెక్కా? సాహితీ సమర రంగంలో అందెవేసిన చెయ్యి కాబట్టే అందుకున్నారు గండపెండేరాన్ని. పెద్దన వంటి సత్కవులు పృథ్విలో లేరని మీరెరుంగరా?

భ : నేను భట్టుమూర్తిని ప్రభూ! నేను భట్టుమూర్తిని. పొగడ్తలు మా సొమ్ము. మీరు విపరీతంగా పెద్దన కవిగార్ని పొగిడేస్తున్నారు.

పె : భట్టుమూర్తి కవీ! ఇంద్రునిచే నియుక్తయయిన మేనక ధీరచిత్తుడైన విశ్వామిత్రుని గెలువలేని స్థితిలో పడిన హృదయాంతర్గత వేదనను సుకుమారంగా ఒక పద్యంలో వివరించండి. ఈ పద్యంలో కచటతప అనే అక్షరాలు ఉండకూడదు.

భ : సుధవెలువార నాహొయలు సోయగముల్ వెలిజిమ్మి రాగముల్
మధురముగా వినన్నుడివి మారుని మాయల నాడి వేడియా
అధర సుధారసంబు గొనుమా యని యీ మునిడాయ నన్గనన్
బధిరుడు లేవదేమి యని భామిని నెవ్వగనందు నెమ్మదిన్.

తి : కృష్ణరాయా! మేనకా విశ్వామిత్రులకే గదా శకుంతల పుట్టింది? పెద్దన గారు విశ్వామిత్రుణ్ణి ధీరచిత్తుడు, ధీరచిత్తుడు అంటారేమిటి?

కృ : ఆ క్షణం వరకు అప్పాజీ!

దూ : తిమ్మన కవీశా! శివుడు తాండవం చేస్తుండగా ఆయనలో అర్ధభాగమైన పార్వతి స్థితి, శిరస్సు మీదనున్న గంగ చంద్రరేఖల పరిస్థితి రస మయంగా ఒక పద్యంలో చెప్పండి ఇందులో తథదధన అనే అక్షరాలు ఉండకూడదు.

నం : సంసార భారాన్నంతా శివుడి మీదే పెట్టి ఆయన నాట్యం చేస్తుండంగా నన్ను వర్ణించమంటారా? అలాగే వినండి.

కరంబు సంభ్రమమ్మె సంగ గంగ పొంగు చెల్వుగా
శిరంబుపై హిమాంశు వాడు చెల్వ గౌరి లీలగా
హరాహరా యటంచు లాస్యమాడు ప్రేమమీరగా
మరుండు దాగి దాగి చూచు మాహరుండాడగా

ఏం ఆనందంగా ఉందా, ధూర్జటి కవీ!.... నా ప్రశ్న వినండి.

నారదుడు నందగోకులంలో కృష్ణుని అష్ట భార్యల యిండ్లను, పదహారు వేల గోపికల యిండ్లనూ తిరిగి ప్రతి యింటా శ్రీకృష్ణునిచూచి వేసారి పొందే రసానుభూతిని తమరు ఒక పద్యంలో చెప్పండి. ఇందులో ప, ఫ, బ, భ, మ అనే అక్షరాలు ఉండకూడదు.

తె : ఈ పద్యంతో ధూర్జటి కవి ఇల్లిల్లూ గిరగిరా తిరుగుతారు.

దూ : నాకూ తెలుసులేవయ్యా రామలింగ కవి ఎక్కడబడితే అక్కడే ఉంటాడని. ప్రభూ! పద్యం వినండి.

నీయర్ధాంగుల యిండ్లకున్ జనితి నన్నింటన్ నినున్ గాంచితిన్
కాయల్ కాచెను కాళ్ళు చూతును సరే కానీయటంచున్ వెసన్
డాయన్నేగితి గొల్లయిండ్లకచటన్ దర్శించితిన్గాదె యో
హోయంచున్ నొకయింతి కొక్కనిగ నీవున్నట్టి తీరున్ హరీ!

అ : మల్లన కవీ! రాముని అరణ్యానికి పంపేటప్పుడు కౌసల్యలో కలిగే మనో వేదననూ స్ఫురింపజేస్తూ ఒక పద్యం చెప్పండి. దానిలో యరలవ అనే అక్షరాలుండరాదు.

మా : ఈ ప్రశ్న నాకేం నచ్చలేదు ప్రభూ! తినేది శ్రీకృష్ణుల వారి సొమ్ము, చేసేది రాముల వారి ప్రస్తావన. ఇది నా మనస్సుకేం బాగాలేదు.

నం : ఆ యిద్దరు ఒకటే లేవయ్యా. కేవలం అవతార భేదమే.

మా : వినండయితే చెబుతాను.

అనఘ నిను కాన కేగన్
పనిచెనె కైకమ్మ నాదు పాపమ్మిది నే
మన నిను గనకుండగ నీ
జనకున కిది సమ్మతంబె సత్యము చెపుమా?

రామభద్ర కవీ! ఇక నా ప్రశ్న వినండి. ద్రౌపదికి కౌరవ సభలో జరిగిన భంగపాటును జూచిన భీముడి ముఖంలో ప్రస్ఫుటమయ్యే భావాలు ఎలా ఉంటాయో ఒక పద్యంలో చెప్పండి. ఇందులో శ ష స హ అనే అక్షరాలుండరాదు.

అ : రాజశేఖర చరిత్రలో ఒక పెండ్లిని రసవత్తరంగా వర్ణించిన నీకు శృంగారంపై మోజు పోయిందేమిటి? వీర రసస్ఫోరకంగా పద్యం చెప్పమంటున్నావు. అయితే వినండి.

కట కట యొక్కరైన నిది కర్జము కాదని పల్కరేమి దు
ర్ఘటన యటంచు నెంచరు తిరంబుగ నిల్తురిదేమి రాజ్యమా
అటవియయంచునెంచు తనయాత్మ విచారముచేయు నార్భటిన్
పటపట పన్నులన్ గొరుకు వాయుజుడాకొలువందు కుందుచున్.

తె : కథా కల్పనా చాతురీ ధురీణుడైన సూరన కవిగారే చెప్పాలి ఈ విషయంపై ఒక పద్యము.

ఒక శివ భక్తుడైన కవి శివరాత్రి రోజున కాళహస్తి వెళుతున్నానని యింటి వద్ద చెప్పి ఒక వేశ్య యింటికి జాగరణ చెయ్యటానికి వెళ్ళాడు. ఆమె కూడా శివ భక్తురాలు కావటంతో అతనిని యింట్లోకి రానివ్వలేదు. ఇంటికి తిరిగి వెళ్ళటానికి యిష్టంలేక ఆ సాని దాని వాకిటి అరుగు మీద తిష్టవేసి, ఎప్పటికైనా తలుపు తీయక పోతుందా అనే ఆశతో ఆ కవి తెల్లవారేటప్పటికే ఒక శతకం చెప్పాడు. ఆయన పద్యాలు ఇంటిలో

నుండి వింటున్న ఆ సానిది గృహాంతర్భాగంలోనే తెల్లవార్లూ నాట్యం చేసింది. ఆ మువ్వల సవ్వడులు, ఆ కవి గొంతుక విన్న గ స్త్రీవాండ్లు ఆ శతకాన్ని వ్రాసుకొచ్చి రాజుగారికి సమర్పించారు. అప్పుడా రాజుగారు ఆ కవి సంగతి తెలిసికొని ఏం చేస్తారో ఊహించి ఒక పద్యం చెప్పండి. ఇందు శషభిషలు ఉండకూడదు.

పె : ప్రభూ! రామలింగకవి ఏదో అనవసరమయిన వ్యక్తిగత ప్రసంగం చేస్తునట్లున్నారు, వారించండి.

తె : నేను అనవసర ప్రసంగం చేయటంలేదు ప్రభూ! రసమయ ప్రసంగం చేస్తున్నాను. సూరన కవీంద్రా! ఆ సంగతి వదిలేద్దాం. మరో సంగతిపై చెప్పండి. హజార రామస్వామి ఆలయ మండపంలో క్రొత్తగా శిల్పులు శిల్పాలు చెక్కారు. ఒక కవిగారు ఆ దేవాలయానికి వెళ్ళినప్పుడు ఒక శిల్పము ఆయన కంటబడింది. ఆయనకా శిల్పము ఒక అప్సర స్త్రీలాగా కనిపించింది. అంత నా కవి రామ రామా అని కన్నులు మూసికొని ఆలయ మండపంలో నుండి వెలుపలికి రావటానికి ప్రయత్నించారు. వస్తూ వస్తూ కనులు మూసుకొన్న కవి మరొక శిల్పాన్ని ఢీకొన్నారు. అది శిల్పంకాదు, ఆమే తనను వెన్నంటుతున్నది అనే భ్రమలోనున్న ఆ కవి 'ఓసి నీ శృంగారం పూడ. ఎటు బోయినా నన్ను వదలి పెట్టేటట్లు లేవే!' అని అన్నారు. అది నాకొక మయ సభలా కనిపించింది. సూరన కవీ! ఆ కవిగారి ధీర చిత్తాన్ని వర్ణించండి.

కృ : రామలింగ కవీ! సూరన కవిగారికి ప్రశ్న నేనిస్తాను. నిషిద్ధాక్షరి మీరు చేయండి. సూరన కవీ! వినండి. మయ సభలో దుర్యోధనుడు కాలు జారి నేలమీద పడ్డాడు. అతణ్ణి చూచి ద్రౌపది నవ్వింది. అప్పుడు దుర్యోధనునకు అచ్చట నున్న శిలా ఫలకాల్లో వేల వేల ద్రౌపది రూపాలు కనిపించాయి. అప్పుడు దుర్యోధనుని మనస్థితి ఒక పద్యంలో చెప్పండి.

తె : ఈ పద్యంలో చ జ ట డ త ద అనే అక్షరాలు ఉండరాదు.

భ : మీరుభయులు కలిసి పింగళి సూరనగారిని మయ సభలో పెట్టేశారు ప్రభూ!

కృ : కళాపూర్ణోదయంలోనున్న కథ కంటే మయ సభ గొప్పదా, భట్టుమూర్తి కవీ!

తి : కృష్ణరాయా! కళాపూర్ణోదయంలోని పద్యం చదువుతూ ఉంటే కథ అర్థమైనట్టే ఉంటుంది. ఆశ్వాసం అంతమయ్యేటప్పటికి అదేమిటో తెలియకుండా పోతుంది.

తె : అందుకే లెండి ఆ కావ్యం మళ్ళీ మళ్ళీ చదవాలని అనిపిస్తుంది.

పిం : పద్యము వినండి ప్రభూ!

సీరము నేం కన్గొనగ నేరక నేను బిరాన నీ సభన్
ఊరక కూలిపోవ గనియున్న పఠాన ముఖాన కిల్బిష
మ్మారగ వేల రూపముల హర్షము పెల్లెగయంగ నవ్వునే
ఆరయ భర్త లేవురని యమ్మకు నారని పొంగు భూమిపై.

తి : కిల్బిషము అంటే విషము. అంతేనా పింగళీ?

పిం : అవునమాత్యా!.. రామకృష్ణ కవీ! నా ప్రశ్న వినండి. శూర్పణఖ మాయ సీత వేషంలో రామలక్ష్మణుల వద్దకు వచ్చింది. నిజమయిన సీత, మాయ సీత 'నేను సీతను' అంటే 'నేను సీతను' అని తగువులాడుకుంటున్నారు. అప్పుడు రాముడు ఆమెను చంపితే నీతో ఉంటాను, నిన్ను చంపితే ఆమెతో ఉంటాను అన్నాడు. వెంటనే మాయ సీత నిజమైన సీతను చంపబోయింది. అప్పుడు లక్ష్మణుడు మాయ సీత ముక్కు కోశాడు. ఈ సన్నివేశాన్ని వివరిస్తూ ఒక పద్యం చెప్పండి. ఆ పద్యంలో గజిబిజి ఉండరాదు.

తె : మళ్ళీ గజిబిజిగా మొదలుపెట్టావు. ఒక కావ్యం ఆ రకంగా వ్రాసిన తర్వాతైనా ఊరుకుంటావేమో అంటే ఊరుకోవు కదా! అవునులేఅలవా టెక్కడికి పోతుంది? వినండి ప్రభూ!

కనుమో రాఘవ నా ముఖమ్ము కనులన్ క్ష్మానాథ సీతమ్మనే
ననియాస్త్రీలు వచింప ధ్ధాత్రి వతిలో నాలోచనన్ సల్పియో వనితా
నిన్ సమయింప నా మెసతియౌ వా యన్న భూపుత్రినిన్
చెనకన్ రక్కసి ఖాన దాని ముకు కోసెన్ స్వామి సౌమిత్రియే.

పె : కృష్ణరాయా! అమవస నిశి అని ప్రయోగించినందుకు నన్ను అల్లరి పెడుతుంటాడు కదా! రామలింగకవి ముక్కు ఇప్పుడు కోసేస్తాను. ఏమిటీ? చెనకన్ రక్కసి బూన దాని ముకు గోసెన్స్వామి సౌమిత్రయే అనేనా నీవు చెప్పింది? గట్టిగా ముక్కు కోశాదనిచెప్పలేవేం? నసుగుతా వెందుకు?

తె : ఎంత రాక్షసి అయినా పరాయి ఆడదాన్ని పట్టుకొని ముక్కు కొయ్యాలి గదా! అందుకోసం తేలికగా ముకు కోశాడు అనిచెప్పాను పెద్దన కవీంద్రా!

తి : నిషిద్ధాక్షరి అద్భుతంగా చేశారు.

కృ : చెలువుగ పదముల గూరిచి
లలి నర్థము ధ్వనియు నెసగ రసమయ కవితన్
పలుకుడి న్యస్తాక్షరి మే
ల్బళి బళి యని పరవశాన ప్రజ మిము మెచ్చన్.

ధ : అయ్యా! పెద్దన కవిగారూ! మొదటి పాదంలో మొదటిఅక్షరం క, రెండవ పాదంలో రెండవ అక్షరం మ, మూడవ పాదంలోచివర అక్షరం ర నాల్గవ పాదంలో చివరక్షరం ల వచ్చేటట్లు కాళిదాస మహాకవిని మన తెనాలి రామకృష్ణ కవిని ఒక పద్యంలో పోల్చి చెప్పండి.

పె : కమనీయంబుగ సంస్కృతంబున కృతుల్ గావించి శ్రీకాళిదా
సమలంబైన యశస్సు గాంచె నిల నాహా రామలింగండు లో
కమమెచ్చన్ రచియించె తెన్గున జగత్కళ్యాణ మందిర్యరున్
సమమై యొప్పిరి కాళికాసతి కృపాసంప్రాప్త వాగీశులై.

ధ : ఆయన మిమ్మల్నెంత హేళన చేస్తున్నా మీరు మాత్రం ఆయనను పల్లకీ ఎక్కిస్తున్నారు.

పె : రామలింగ కవి చేసేది హేళన కాదు ధట్టిమూర్తీ! అది హాస్యం. అతని పాండిత్యాన్ని వేరుగా, అతని హాస్యాన్ని వేరుగా, అతని మహోన్నత మైన వ్యక్తిత్వాన్ని వేరుగా చూడటంలోనే నాకానందముంది.

తె : పెద్దనగారు నన్ను మునగ చెట్టెక్కిస్తున్నారు. పడితే ముందు వండ్లు విరిగితే నవ్వుదామని కోరిక; నాకు తెలీదేమిటి?

పె : నాయనా భట్టుమూర్తి కవీ! ఒకటి రెండు మూడు నాలుగు పాదాలలో ప్ర, త, చ, క అనే అక్షరాలు యతి స్థానంలో ఉండేటట్లు కరుణ రసంతో రామాయణార్థంలో ఒక పద్యం చెప్పు.

భ : పద్యం వినండి.

బంగరు లేడి వెంటపడి ప్రాంగణమున్ విడినాడ నిన్ను నెం
దుంగవనేర్తు జానకి హతోస్మి యటంచును రక్కసుండ చ
చ్చెంగద యట్టి రాక్షసులచేత బడన్నిక నీవు నాకు ద
క్కంగల దానవే యనుచు కన్నుల సీరిడె రాముడవ్వనిన్.

పిం : భట్టుమూర్తి గారి పద్యంలో రాముడేదో వెనకకు ముందుకు పోతున్న ట్లుంది.

భ : అసలే పెండ్లాము కనిపించకుండా పోయింది. అరణ్యంలో నున్నాడు. డోలాయ మానమైన మనస్సు బాధతో భగ్గుమంటున్నది. ఇంకేం చేస్తాడు? అయనేం కమ్మగా కళా పూర్ణోదయంలాంటి కావ్యం వ్రాసుకుంటూ రాయలవారి కొల్వులో లేడుగదా!

ధూ : అయ్యా, తిమ్మన కవిగారూ! ఒకటి, రెండు మూడు, నాలుగు పాదాలలో చిట్టచివర వ్య, య, య, ర అనే అక్షరాలుండేటట్లు భారతార్థంలో హాస్యం స్ఫురించేటట్లు ఒక పద్యం చెప్పండి.

నం : వినండి.

రమ్ము బృహన్నలా! శరపరంపర నే గురిపింతు శత్రు వ్యా
హమ్ముల చీల్చి చెండెద మహత్తరశక్తి రథాన నిల్చి య
శ్వమ్ముల నీవు దోలినను చాలును బాపురె యుత్తరుండె యిం
కెమ్మెయి నిల్వనేర్తు మని యీ వసుదేశులు పారిపోవరే!

నేను పద్యం చెప్పాను. అయ్యా ధూర్జటిగారు! తమరు పరుగెత్తి పోతారో, యుద్ధం చేస్తారో? యిక మీ వంతు. నా ప్రశ్న వినండి. ఒకటి రెండు, మూడు, నాలుగు పాదాలలో క్రమంగా మొట్ట మొదట్లో ఏ క్ష వ న అనే అక్షరాలు వచ్చేటట్లు భాగవతార్థంలో ఒక పద్యం చెప్పండి.

ధూ : వినండి.

ఏరా కృష్ణ యిదేమి యాగడమురా యీరీతి వారిండ్లలో
క్షీరంబుల్ నవనీతముల్ దదుల నిన్నీ మెక్కగా జెల్లునా
వారల్ స్నానము సేయువేళ తగునా వస్త్రంబులిన్ దాచనే
నేరీతిన్ మనుదాన తండ్రి నిజమా యీ వాదు చెప్పంగదే.

పె : నంది తిమ్మనగారు ధూర్జటికి గిట్టని కృష్ణభక్తి తో దేదుంపతెంచుతున్నారు.

తె : ధూర్జటి కృష్ణుడి విషయంలో తీసిపోడు లెండి.

పె : శ్రీకృష్ణుడి విషయంలోనా, తెనాలి రామకృష్ణుడి విషయంలోనా?

నం : ఏది ఏమైనా ఉన్నది కృష్ణరాయల కొల్వులో గదా! ఆయన యాస్థాన మున నుండి ఆయనను వర్ణించుట ఔచిత్యమే కదా!

ధూ : ఆనందంగా వినండి తిమ్మన కవీ!

ధరమున నీశుడు నందర
కరుణన్ రక్షింప లోక కళ్యాణమ్మున్
నెరపగ విష్ణువు కవితన్
సరసతతో జెప్ప బ్రహ్మ స్వాంబితదే.

అయినా ఒక్క విషయం గమనించండి. ముఖ్యంగా ఆ ఈశ్వరత్వం వల్లనే లోకేశ్వరత్వం కలుగుతున్నది.

అ : మల్లన కవిగారూ! ఒకటి, మూడూ పాదలలో ఈ, ప అనేవి మొదటి అక్షరాలు, రెండు, నాలుగూ పాదాలలో చ, వ అనేవి చివరక్షరాలు అయ్యేటట్లు భారతార్థంలో ఒక పద్యం చెప్పండి.

మా : వినండి.

ఈ విధి కొల్వుకూటమున నిందరు పెద్దలు చూచుచుండగా
కావరమెక్కి కౌరవులు కాంతను నన్ను వివస్త్ర చేయుచున్
పోవుచునున్నవారు పతి పుంగవులెల్లరు బొమ్మలైరి యో
దేవిక నాకు దిక్కెవరు దీనను కావగ రావ మాధవా.

దూ : వినండి.

ఏరా కృష్ణ యిదేమి యాగడమురా యీరీతి వారిండ్లలో
క్షీరంబుల్ నవనీతముల్ దధుల నిస్సీ మెక్కగా జెల్లునా
వారల్ స్నానము సేయువేళ తగునా వస్త్రంబులన్ దాచనే
నేరీతిన్ మనుదాన తండ్రి నిజమా యీ వాదు చెప్పంగదే.

పె : నంది తిమ్మనగారు దూర్జటికి గిట్టని కృష్ణభక్తి తో దే దుంపతెంచుతున్నారు.

తె : దూర్జటి కృష్ణుడి విషయంలో తీసిపోడు లెండి.

పె : శ్రీకృష్ణుడి విషయంలోనా, తెనాలి రామకృష్ణుడి విషయంలోనా?

నం : ఏది ఏమైనా ఉన్నది కృష్ణరాయల కొల్వులో గదా! ఆయన యాస్థాన ముననుండి ఆయనను వర్ణించుట ఔచిత్యమే కదా!

దూ : ఆనందంగా వినండి తిమ్మన కవీ!

దురమున నీశుడు నందర
కరుణన్ రక్షింప లోక కళ్యాణమ్మున్
నెరపగ విష్ణువు కవితన్
సరసతతో జెప్ప బ్రహ్మ సర్వంబితడే.

అయినా ఒక్క విషయం గమనించండి. ముఖ్యంగా ఆ ఈశ్వ రత్వం వల్లనే లోకేశ్వరత్వం కలుగుతున్నది.

అ : మల్లన కవిగారూ! ఒకటి, మూడూ పాదలలో ఈ, ప అనేవి మొదటి అక్షరాలు, రెండు, నాలుగూ పాదాలలో చ, వ అనేవి చివరక్షరాలు అయ్యేటట్లు భారతార్థంలో ఒక పద్యం చెప్పండి.

మా : వినండి.

ఈ విధి కొల్వుకూటమున నిందరు పెద్దలు చూచుచుండగా
కావరమెక్కి కౌరవులు కాంతను నన్ను వివస్త్ర చేయుచున్
పోవుచునున్నవారు పతి పుంగవులెల్లరు బొమ్మలైరి యో
దేవిక నాకు దిక్కెవరు దీనను కావగ రావ మాధవా.

అయ్యా! రామభద్ర కవిగారూ! ఓ, ప, చ, న అనేవి ఒకటి రెండు, మూడు, నాలుగు పాదాలలో వరుసగా మొదటి అక్షరాలుగా ఉంచి రామాయణార్థంలో ఒక పద్యం చెప్పండి.

అ : వినండి.

ఓ కమలాయతాక్షి నిను నుల్లము నందున నమ్మలేక నే
పోకడ బెట్టితంచు రఘు పుంగవు డయ్యో వచింపరాదె యా
చాకలి వాడు పల్కెనని సాకును చెప్పగనేల లంకలో
నే కనుగొంటి నగ్ని జొరవేయని పల్కినవాని రూపమున్.

కృ : ఇద్దరూ కరుణరసంతోటే ఉల్లాన్ని పల్లవింపచేశారు.

తె : ఆ రసంతో నీరసం వచ్చి పల్లవం వంటి హృదయం మల మలా మాడి పోతుంది ప్రభూ! ఆ కవిత్వం చెప్పేవాడికి ఏడుపే వినేవాడికి ఏడుపే.

పె : కాదు రామలింగా! అది హృదయాన్ని స్పందింప చేస్తుంది. మనిషిని మనిషిగా నిలువ బెడుతుంది. మనిషి మనుగడకు హాస్యం ఎంతవసరమో ఆలోచనా అంతే అవసరము.

తె : ఏది ఏమైనా నాకు మాత్రం బ్రతికున్నంత కాలం నవ్విస్తూ, నవ్వుతూ ఉండాలనే ఉంది. వీలైతే చచ్చిన తర్వాత కూడా నవ్వాలనే ఉంది ప్రభూ!

ధూ : చచ్చిం తర్వాతేం నవ్వుతావు? నవ్వితే చచ్చేటప్పుడు పండ్లిగిలిచ్చి నవ్వవచ్చు.

తె : అట్లా అనుకోవాక. నే చచ్చిం తర్వాత కూడా జనమంతా నా పేరు తలచుకుంటేనే నవ్వుతారు. ఆ విధంగా నేనూ సజీవంగానే ఉంటాను.

అయ్యా పింగళివారూ! ర ,స, న, ద అనేవి చివరక్షరాలుగా మోహినీ అవతారమెత్తిన హరి హరునితోచెప్పే మాటలను ఒక పద్యంలో చెప్పండి.

పిం : వినండి.

హర పరుగెత్తి పోకుము భయంబొక యింతయు లేదు నే హరిన్
పరమ కృపాబ్ధి యాయసుర ప్రాణము దీసెద చూడు మిట్టి నుం

దరతర రూపమా దనుజు నాశము సేయగ బొందినాడ నా
సరసత వాని దేల్చి కను సన్నల బూడిదజేతు నిప్పుడే.

తె : మూడు కన్నులున్న వాడు బూడిద చేయగలిగిన వాడు పరుగెత్తి పోతున్నాడా?! ఆడదాని రూపంలో వచ్చిన శ్రీహరి ఆయనను రక్షించాలా?! ఆ ఈశ్వరుడి పని అంతే.

దూ : కరుణామయుడైన ఈశ్వరుడు చంప బుద్ధి పుట్టక పరుగెత్తిపోతున్నాడు. కన్ను తెరిస్తే అసురుడు ఎప్పుడో భస్మమై పోయుండేవాడు.

పె : ఒక్కొక్కప్పుడు వేయికన్నులున్న రామలింగకవి కూడా ఏమీ చేయలేడు. పరువెత్తి పోవాల్సిందే.

పిం : రామలింగ కవీ! న, భ, శ్ర, మ అనే అక్షరాలు యతిస్థానంలో వచ్చేటట్లు భాగవతార్థంలో ఒక పద్యం చెప్పండి.

తె : వినండి.

ఓ సతి నీవు రుక్మిణిగ నుద్భవమందుము నేను భూమిపై
భాసుర కృష్ణ రూపమున భార్యగ పొందెద నిన్నటంచు తా
చేసిన బాసలన్మరచి శ్రీహరి వచ్చునొ రాడొ నన్నిటన్
మోసము చేయునో యనుచు ముగ్ధ తలంచును తప్తచిత్తయై.

దూ : కేవలం శ్రీమహాలక్ష్మి అవతారమైన రుక్మిణికి కూడా కృష్ణుడు మోసం చేస్తాడనే అనుమానం ఉందన్నమాట?!

తె : పెండ్లయ్యేంత వరకూ ఏమైనా అనుమానాలు ఉండవచ్చు. పెండ్లయిన తరువాత పెద్దమనిషిలాగా ఉండగలిగితే చాలు.

కృ : న్యస్తాక్షరిని మహదానందంగా చేశారు.

పదముల కూరుపు హాయములు
కదలిన యటులుండ లోక గణనీయముగా
సదమల సూక్తులు బలుకుచు
విదితముగా దత్తపదిని వినిపింపు డికన్.

తి : కృష్ణరాయా! వరముల నిచ్చుట నావంతు. పద్యము చెప్పుట వారివంతు. పెద్దనగారూ! గుట్టు, చెట్టు, పట్టు, రట్టు అనే పదాలను వాడి, రామాయణార్థంలో ఒక పద్యం చెప్పండి.

పె : వినండమాత్యా!

చెట్టుల గుట్టలన్ వెదకి చేరెను మారుతి లంక నింక నీ
గుట్టును రట్టుచేయు తనకున్ గల వానర సేనతోడ ని
న్నెట్టులనైన రాముడు వధించును నా పలుకాలకించి నీ
పట్టును వీడుమన్న మన వంశము నాశముగాక యుండగన్.

తి : ఈ పద్యంలో మీరు చెప్పింది రావణునితో విభీషణుడు చెప్పిన మాటలు- అంతేనా?

పె : అవును మహామంత్రీ! బుద్ధిగా బ్రతకమని అన్నకు తమ్ముడిస్తున్న ప్రబోధం.

తి : భట్టుమూర్తిగారూ! నెనరు, వినరు, కనరు, మనరు అనే పదాలను వాడి భారతార్థంలో ఒక పద్యం చెప్పండి.

భ : వినండి.

వినరు మదీయ సూక్తులను వృద్ధుడు చెప్పెనటంచు నెంచరే
మనరుజ వీరికెక్కె నిక మానసమందున దోచునట్టి యా
నెనరును జంపుకోవలయు నీతులు చెప్పగరాదు కౌరవుల్
కనరు నిజమ్ము వారికిని కాలము చేరువ యయ్యె మాధవా.

తి : ఇది భీష్ముడు కృష్ణునితో చెప్పిన సంగతి- అంతేనా?

భ : అంతే మహామంత్రీ! చెప్పిన మాటలను వినని కౌరవులపై అభిమానం చంపుకోలేక భీష్ముడు పడుతున్న మనోవేదన.

తి : రామభద్రకవీ! వనము, ధనము, మనము, కనము అనే పదాలనుంచి రామాయణార్థంలో ఒక పద్యం చెప్పండి.

అ : వినండి.

ధనమును రాజ్యమున్ విడుము దాశరథీ యనవచ్చునే యిటుల్
వనమున కేల వంపవలె వాని ముఖాబ్జము చూదకుండగా
మనము క్షణంబు నిల్వగలమా యిక జీవము లెట్టులుండునే
కనము గుణాభిరామునని క్ష్మాపతి కూలె ధరాతలంబునన్.

తె : చేసేటప్పుడేమో చేసేదీన్నీ, ఎడ్చేటప్పుడేమో ఎధవేడుపు ఏడ్చేది.

అ : రామలింగ కవీ! నన్ననటంలేదుకదా!

తె : రస స్పందన నా మనస్సుకు అంతగా కలిగిందయ్యా రామభద్ర కవీ! మిమ్ములను నేను అట్లా అంటానా?

పె : దశరథుని చేతలు, వాని బాధలు నీకు తెలేవా రామలింగా! సర్వాంత ర్యామి లీలలను సర్వం తెలుసుకున్న నీవు మాయాజాలం చేయటానికి మాట్లాడుతుంటావు.

తి : మల్లన కవీ! మొగ్గ, నిగ్గు, అగ్గి, నుగ్గు అనే పదాలు వాడి భారతార్థంలో ఒక పద్యం చెప్పండి.

మా : వినండి మహామంత్రీ!

నిగ్గులుదేరు నీ మొగము నే నెచటన్ కనుగొందు గుండెలో
నగ్గి భరింప జాల నిను నా దురితాత్ములు నుగ్గు నూచగా
మొగ్గర మందు జంపితిరె ముద్దుల నా సుతుడాయటంచు లోన్
తగ్గని శోకభారమున తల్లడమందెను పల్గుణుండటన్.

తె : ఇది మరొక ఏడుపు.

కృ : ఈ దుఃఖం ఎవరికీ రాకూడనిది రామలింగ కవీ!

పె : ఆయుర్దాయం వ్రాసి పెట్టినంతవరకే ప్రభూ!

తి : తిమ్మన కవీంద్ర! ఎంత, సంత, భ్రాంత, శాంత అనే పదాలను వాడుతూ భారతార్థంలో ఒక పద్యం చెప్పండి.

నం : వినండి అమాత్యా!

ఎంతయు మౌని శాప వశ డిద్ధచరిత్రుడు పాండురాజు లో
సంతతి గోరి చింతల ప్రసన్న మనస్విని కుంతి మన్మథ
భ్రాంత యొకింత గాక యమ వాయు మహేంద్రుల పూజసేయ స
త్సంతతి కల్గె పాండు విభు స్వాంతము శాంతము నంద నంతటన్.

తి : కుంతి చేసిన పూజా ఫలంగా పాండవులు పుట్టారంటారు?

నం : అమాత్యవర్యా! దూర్వాస మహర్షి వరంగా యిచ్చిన మహా మంత్రాన్ని కుంతి జపించింది. ఆమె ఆహ్వానాన్ని మన్నించిన దేవతలు ప్రత్యక్ష మయినారు. ఆమె పూజకు సంతుష్టులైన దేవతల వరప్రసాదం వలన ఆమెకు బిడ్డలు పుట్టారు.

పిం : మంత్రాలకు చింతకాయలు రాలాయంటారు! అట్లా వరప్రభావం వలన పుట్టిన వారైతే ధర్మరాజును ధర్మజుడు అని, భీముణ్ణి వాయు నంద నుడు అని, అర్జునుణ్ణి దేవేంద్ర సూతి అని పిలవ వలసిన అవసరం లేదు గదా!

నం : భారతాన్ని ప్రమాణ గ్రంథంగా తీసుకుందాము. దేవతల వరప్రభావం వలన బిడ్డలు పుట్టారనేది నిర్వివాదాంశం. ధర్మజుడు అనే దానికి యమ ధర్మరాజు వరంవలన పుట్టినవాడూ అని అర్థం చెప్పుకుందాం. ఆ విధంగానే మిగతా శబ్దాల సార్థకతను గమనిద్దాం. దైవికమైన శక్తిని నమ్మటం సముచితమైనది. అట్లా నమ్మకుండా దేవతలను రచ్చకీడ్చటం ఔచిత్యం గాదు.

పిం : అదే నిజమయితే వారిని రచ్చకీడ్చటంలో తప్పేం లేదుగా?

నం : పింగళి! ప్రాచీన రచనలను సక్రమంగా చూడటం అలవరచుకోండి. విష యానికి ఔచిత్యం సంతరించగలిగితే ప్రయత్నించండి. అంతేగాని, ఈ రకంగా మాట్లాడటం భావ్యం కాదు.

పె : ఈ విషయంలో తర్కోప తర్కాలు అనవసరం. ప్రాచీన గ్రంథాల దృష్ట్యా చూచే నంది తిమ్మన గారి అభిప్రాయం అది. నవీనమైన దృక్ప థంతో చూచే పింగళి సూరనగారి అభిప్రాయం ఇది.

తె : ఏమిటో పెద్దనగారు అదీ ఇదీ, ఇదీ అదీ అంటున్నారు!

తి : రామలింగ కవీ! రాగము, భోగము, త్యాగము, యోగము అనే పదాలను వాడి వేంకటేశ్వరస్వామిపై ఒక పద్యము చెప్పండి.

తె : వినండి మహామాత్యా!

రాగము వీడి యింద్రియ పరాఙ్ముఖతన్ భవదీయ సేవయే
భోగము గాగ భార్య నిజపుత్రుల నాప్తుల నాత్మబంధులన్
త్యాగము చేసి నీ వరపదాబ్జములన్ భజియించి యాత్మసం
యోగము పొంద గోరెద పయోధి సుతావర వేంకటేశ్వరా.

దూ : ఏమిటో, రామలింగ కవి నిజపుత్రులు అంటున్నారు. నిజంగా కాకపోతే అబద్ధంగా ఉంటారేమిటి?

తె : సొంత కొడుకులు కాకుండా సంతలో పుట్టేవాండ్లు కూడా ఉంటారు దూర్జటి కవీ!

తి : దూర్జటి కవీంద్రా! కారము, భారము, నేరము, తీరము అనే పదాలను వాడుతూ భారతార్థంతో ఒక పద్యము చెప్పండి.

దూ : వినండి మహామంత్రీ!

ఈయవ మాన భారము సహించుట నేరము ధర్మరాజా మా
దాయల దుష్కృతాబ్ధి బడి తానొక తీరము చేరజాలద ద
న్యాయము వారు చేసిరన నౌనను కారము నుప్పుతిన్న యీ
వాయుజుడెట్టు లూరకొను వారి శిరంబులు నేల వ్రాలకన్.

తె : సూరనకవీ! సాగు, మ్రోగు, ఊగు, దాగు అనే పదాలతో భాగవతార్థంలో ఒక పద్యం చెప్పండి.

పిం : వినండి మంత్రివర్యా!

సాగునె యిట్టి యాగడము స్వామి చతుర్దశలోకజాలమున్
లోగొని సంతసాన మధురోహల నూయలలూగు నిన్ను నా
లో గనినాను నా తలపులో వినిపించును మ్రోగు వంశి యీ
దాగుడు మూతలాపి నను తావక దాసిని బ్రోవరా హరీ.

తి : పింగళీ! ఈ పద్యాన్ని కృష్ణునితో ఎవరన్న సందర్భంలో? రాధ అన్న సందర్భంలోనా?

పిం : అష్ట భార్యలలో ఏ భార్యయైనా అని యుండవచ్చు. లేదా పదహారు వేల గోపికలలో ఏ గోపికైనా అనియుండవచ్చు. లేదా రాధే అని యుండవచ్చు. లేక ఏ భక్తుడైన తననొక స్త్రీగా భావించుకొని పరమాత్మే పురుషుడనే దృష్టితో పలికియుండవచ్చు.

తి : ఈ కవి యిదికూడా సూటిగా చెప్పటంలేదు కృష్ణరాయా!

పిం : మహా మంత్రికి నా అభిప్రాయము స్పష్టమైననూ పరిహాసము లాడు చున్నారు.

ధూ : సూరన కవీంద్రా! మీ పద్యంలో ఏవో వింతలు కనిపిస్తున్నాయ్. పరమాత్మ పధ్నాలుగు లోకాలను తన పొట్టలో పెట్టుకొనటం ఏమిటి? అవన్నీ పెట్టుకొని ఉయ్యాలలూగటం ఎమిటి?!

నం : భగవంతుడు అన్ని జగాలనూ సంరక్షించేవాడు కాబట్టి అయన కడుపులో పెట్టుకొని కాపాడుతున్నాడని కవి అభిప్రాయం. హాయిగా జీవులందరినీ ఆనందంతో చూస్తున్నాడు కాబట్టి మధురోహలతో ఊయల లూగు తున్నాడు అని కవి చెప్పాడు.

తి : తలపులో వంశి, అంటే పిల్లనగ్రోవి వినపడటం ఏమిటి?

తె : మంత్రివర్యా! మధ్యమధ్యలో నా బాధ్యత మీరు తీసుకుంటున్నారు. నా అంతరాత్మలో కలిగే ఆలోచనలు మీకెలా తెలుస్తున్నాయో నా కర్థం కావటంలేదు.

పిం : మీరంతా నా ఒక్క పద్యంపై యింత వ్యాఖ్యానం చెబుతున్నారే! ఇంక నా కావ్యం కళాపూర్ణోదయంపై మిమ్ములను వ్యాఖ్యానం వ్రాయమంటే ఎంత వ్రాసేవారో!

తె : ఆ పని మేం చెయ్యంగా!

కృ : అప్పాజీ! మీరు మన అష్టదిగ్గజా లందరికీ పదాలను సులువుగా పద్యంలో ఉంచటానికి వీలయ్యేటట్లు ఇచ్చారు. నేనిస్తాను మరి రెండు చూద్దాం.

నేరుపు, కూరుపు, తీరుపు, ఊరుపు అనే పదాలను వాడి భారతార్థంలో ఎవరైనా ఒక పద్యం చెప్పండి చూద్దాం.

పె : ఇదికూడా చాలా సులువైనదే ప్రభూ! కవులపై మీకుగల పక్షపాతం వలన క్లిష్టమైన పదాలను ఇవ్వటానికి మీ హృదయం ఒప్పుకొనటంలేదు. పద్యం వినండి.

నేరుపుజూపి నీ సుతుల నిర్ణయమున్ మరలించి సంధినిన్
కూరుచుమో నరేశ నృపకుంజరు లెల్లరు మెచ్చ పాండవుల్
కోరిన యూళ్ళ నైదిటిని కూరిమినీయగ తీరుపీయు మీ
కూరుపు నీకు క్షేమమన గొబ్బున క్ష్మాపతి వీడె నూరుపున్.

తి : ఈ కూరుపు నీకు క్షేమము అని అన్నదెవరూ? ఎవరితో అన్నారు?

పె : కృష్ణ పరమాత్మ ధృతరాష్ట్రుడితో అన్నారు.

తె : 'గొబ్బున క్ష్మాపతి వీడె నూరుపున్' అంటే పెద్దన కవీంద్రా! ధృతరాష్ట్రుడు గుటకాయ స్వాహా అన్నాడు - అంతేనా?

పె : కేవలం చేతగాని పరిస్థితిలో ఊర్పు వదిలి పెట్టాడు. అక్కడ ఊరుపు అంటే శ్వాస అని; ప్రాణం కాదు.

కృ : ఇది యింకా క్లిష్టమైన దత్తపది. చూద్దాం ఎవరు పద్యం చెబుతారో. వినండి పదాలు. వినుకొండ, కొండవీడు, మంగళగిరి, రాయదుర్గము.

(సభలో ఒకరి మొగము ఒకరు చూచుకొనుచుందురు.)

తె : పద్యం వినండి ప్రభూ! పసందుగా చెబుతాను.

చెలి విను కొండపై సురలు చేరిరి బారుగ కొండ వీడుగా
గల దొరకిష్టు పెండ్లియని కామిని మేనక నీవు సర్వమం
గళ గిరిరాజ పుత్రికను గ్రక్కున సేయుము పెండ్లికూతునిన్
కలువలరాయ దుర్గ ముఖకంజము జూచుకొనంగ నిల్వుమా.

దూ : మీరిచ్చిన పదాలను వాడి ఈశ్వరుని పాదాలను పట్టుకుండేటప్పటికే రామలింగకవికి పద్యం వచ్చేసింది ప్రభూ! అవసరం వస్తే ఎవరి కాళ్ళయినా పట్టుకోగలడీ రామలింగకవి.

తె : నాకు కన్పించేది జగన్మాత పార్వతి. ఆమె కల్యాణ సందర్భాన్ని వర్ణిం చాను. ఆమె భర్త కావటం చేత ఆ మహేశ్వరుడు కూడా నాకు పూజ నీయుడే. శబాష్! నేను కవిత్వం చెప్పటానికి పరమేశ్వరుని కాళ్ళు పట్టు కున్నాను. నీవు సరసమైన కవిత్వం చెప్పటానికి సానిదాని పద....

పె : ప్రభూ! సభా మర్యాదను దృష్టిలో నుంచుకొనకుండా అసందర్భ ప్రసంగం జేస్తున్న తెనాలి రామకృష్ణుణ్ణి వారించండి.

తె : పెద్దనగారికిది అమవస నిశి గాని తెలి వెన్నెల పున్నమిగాని కాదు గదా! నేను దూర్జటిని అంటున్నది ఇంతే. సరసమైన కవిత్వం చెప్పటానికి సానిదా....నిపదా అని సంగీతం పాడే సరస్వతీదేవి కాళ్ళు పట్టుకున్నావు అని.

పె : కప్పి పుచ్చుకొనటంలో నీవు ఘనుడవు అని నాకు బాగా తెలుసులే.

దూ : ప్రభూ! ఈ ఘర్షణ ఏమైనా ఈ పద్యంలో సరసత లోపించింది. హిమ వంతుడు. 'ఓ చంద్రా మా పార్వతి తన ముఖ పద్మం చూసుకుంటుంది. నీవు నిల్చో' అన్నాడు.

పిం : హిమవంతుడింట్లో అద్దం లేదేమో!

తె : పింగళికి తెలిసినంత మాత్రం కూడా నీకు తెలేకుండా పోయింది గదా దూర్జటి కవీంద్రా!

(రాయలు చిరునవ్వు నవ్వును)

దూ : నవ్వకండి ప్రభూ! నా మాట వినండి. అలా చుట్టం చూపుగా వచ్చినవాణ్ణి 'నీలో మా అమ్మాయి అందం చూసుకుంటుంది; నిల్చో' అనటం ఏమీ బాగాలేదు. పార్వతి ముఖం చూచినంత చంద్రుని ముఖం ముడుచుకొని పోతుంది. మరియు చంద్రుణ్ణి చూస్తే పార్వతి ముఖపద్మం వాడిపోతుంది. అందువల్ల యిందులో రసస్ఫురణ లేకుండాపోయింది.

తె : దూర్జటి కవీ! పార్వతి లోకమాత. అందువల్ల, ఆ పసివాడైన చంద్రు డికి ఆ తల్లి ముఖం చూసుకుంటుంది అంటే ఆనందంగానే ఉంటుంది. అది ఆ తల్లికీ ఆనందకరమే! మధ్యలో నీవూ నేను ముఖాముఖీ గుద్దు కోటం అనవసరమేమో!

తి : దత్తపదిని రసవత్తరంగా నిర్వహించారు.

కృ : మహాకవులారా!

ఇచ్చిన సమస్య పద్మము
విచ్చెను రవి కిరణ పంక్తి వేడిమి యనగాన్
చెచ్చెర పూరింపుడు ప్రజ
అచ్చెరువున మిమ్ము మెచ్చి యానందపడన్.

అప్పాజీ! దత్త పదులన్నీ మీరే యిచ్చేశారు. సమస్యలను నన్నివ్వనివ్వండి. పెద్దన కవీంద్రా! నా సమస్య - 'కలువలు నవ్వె భాస్కరుని గాంచిన యంతనె వింత వింతగన్'....పూరించండి.

తి : నాకు ఆశు కవిత్వం రాదుగాని లేకపోతే నేనే పూరించి ఉండేవాణ్ణి - 'పెద్దన అనే సూర్యుడిలాంటి కవిని చూచి ఆయన పద్యం చెప్పలేక యిబ్బంది పడుతున్న సమయంలో మిగతా కవుల ముఖాలు కలువలై నవ్వాయి' అని.

పె : పద్యం చెప్పలేకపోతేగదా? అమాత్యవర్యా! వినండి.

కలత యెదన్ దహింప తన కన్న కుమారుని చూచు వేడుకన్
పిలువగ జేసె కర్ణు నతి భీకర రాత్రమునందు కుంతి వా
రల పలుకాలకింప రవి రాజిలె నచ్చట నీట విచ్చు చెం
గలువలు నవ్వె భాస్కరుని గాంచిన యంతనె వింత వింతగన్.

తి : కర్ణుడూ కుంతీ రాత్రిపూట మాట్లాడుకుంటుండంగా సూర్యుడు వచ్చి పొంచి విన్నాడా!? నీటిలో విచ్చుకొనే ఎఱ్ఱ కలువలు నవ్వాయా!?

కృ : చూచారా అప్పాజీ! మీ పూరణకు పెద్దన కవీంద్రుల పూరణకు ఉన్న తేడా? ధూర్జటి కవీంద్రా! ఈ సమస్యను మీరు పూరించండి. సమస్య—

'ధర మున్నెత్తెను గౌరి శంకరుడు చేతమ్మందు భీతిల్లగన్'

తి : పార్వతి జగజ్జనని; హిమవంతుని కూతురు. సులువుగా ఒక కొండ ఎత్త గలిగి యుండవచ్చు. శివుని విల్లైన మేరు పర్వతాన్ని ఎత్తి యుండ వచ్చు. కానీ కృష్ణరాయా! నీవు చెప్పేది భూమినే ఎత్తేసిందనా?! కొంచెం క్లిష్టంగానే ఉంది.

ధూ : అంత కష్టమేం లేదమాత్యా!....ప్రభూ! నా పూరణ వినండి.

స్మర సంహారి కృపాంతరంగుడు నిజాత్మన్ లింగమున్ జేసిరా
వరగొంపోవు మటంచు నిచ్చె తనకున్ ప్రాప్తంబు లేకన్ ధరన్
పరగన్ జేసిన యట్టి రావణుడు లేపన్‌రాక కైలాస భూ
ధరమున్నెత్తెను గౌరి శంకరుడు చేతమ్మందు భీతిల్లగన్.

తి : పరమ భక్తుడైన రావణాసురుడు ఈశ్వరుని ప్రాణలింగం తీసి కెళుతూ దానిని నేలమీద పెట్టాడా?!దానిని లేవటానికి సాధ్యంకాక కైలాసపర్వత మెత్తాడా?! శబాష్! బాగుంది పూరణ.

కృ : తిమ్మన కవీ! మీ ముచ్చటైన పూరణను వినాలని నా కోరిక. సమస్య చెబుతున్నాను.

'రాముడు సత్యభామను పరాకున కౌగిలి చేర్చి ముద్దిడెన్.'

నం : ఇది ప్రభువుల కెంతో యిష్టమైన కావ్యం పారిజాతాపహరణం తాలూకూ కథావిశేషం. చెబుతాను వినండి.

ఏమియొ నారదుండు మది నించుకయేనియు చింత సేయడీ
స్వామికి నష్ట భార్యలని చక్కని వెన్మిది పారిజాతముల్
ప్రేమతొ యీయవచ్చునె దరిద్ర మటంచు తలంచు గోపికా
రాముడు సత్యభామను పరాకును కౌగిలి చేర్చి ముద్దిడెన్.

తి : కృష్ణరాయా! గోపికారాముడంటే?

కృ : గోపికలను రమించేవాడూ అని.

తి : అంటే?

కృ : గోపికలను ఆనందపరచేవాడూ అని.

తె : ఇక్కడ నాకొక చిన్న సమస్య ప్రభూ! పదహారువేల గోపికలనూ అష్ట భార్యలనూ ఆనందపరిచే గోపాలకృష్ణ పరమాత్మకు పదహారువేల ఎనిమిది పారిజాతాలు కావాలిగదా! అచ్చం భార్యల వరకే ఎందు కాలోచించాడూ అని?

కృ : అత్యవసరంగా అంతవరకయితే చాలూ అని.

తె : ఆ ఎనిమిదీ తీసికొచ్చి యిస్తే తన్నులు లేకుండా బ్రతుకవచ్చునని పరమాత్మ ధైర్యమంటారు.

నం : ప్రభూ! భార్యలకూ, గోపికలకూ అందరికీ పారిజాత సుమసౌరభము అందుబాటులో ఉండాలనే పరమాత్మ పారిజాత వృక్షాన్ని నందనోద్యాన వనం నుండీ ద్వారకకు తీసికొచ్చాడు.

తె : తిమ్మనకవిగారూ! నేను ఈ కొలువులో చేరిన నాటినుండీ మిమ్ములనొక సంగతి అడగాలని అనుకుంటూనే తాత్సారం చేస్తున్నాను. తమ కావ్యానికి పారిజాతాపహరణం అంటే- పారిజాత అపహరణం అని పేరు పెట్టటం పరమాత్మను కించపరచటం కాదా! ఇది నా తీరని సంశయం.

ధూ : ఆయన చిన్నప్పటినుండీ ఎన్నో దొంగతనాలు చేశాడు. వెన్న దొంగిలించాడు, గోపికల బట్టలను దొంగిలించాడు, రుక్మిణిని దొంగిలించాడు. పారిజాతాన్ని దొంగిలించాడూ అంటే తప్పేముందీ?

తి : (ధూర్జటిని ఉద్దేశ్యించి) అది పరమాత్మ లీలలో ఒక భాగమంటారు?!

వ : మొదటివి రెండూ గోపికల రూపంలోనున్న మహర్షుల ఆనందం కోసం పరమాత్మ పసితనంలో పరబ్రహ్మగా చేసిన లీలలు. రుక్మిణిని తీసికొనిరావటం కేవలం ఆమె కోరిక మీద. ఆమె యిల్లు కదిలి ఆ కృష్ణ పరమాత్మ కోసం ముందంజ వేస్తేనే ఆయన తీసికొని వచ్చారు. ఆ సమయంలో వెంటబడిన రాజులనందరినీ జయించారు. అందువల్ల అది అపహరణం అనిపించుకోదు. ఇక పారిజాతావహరణం సంగతి కొద్దాం. సత్యభామ కృష్ణుణి పరిపూర్ణంగా అర్థం చేసికున్నదై 'ఇది దేవతలనూ రాక్షసులనూ సమకూర్చి మీరు సముద్రాన్ని మథనం చేయించిన సమయంలో పుట్టిన వృక్షమే కదా! ఏదో ఉంటుందని నందనోద్యాన వనంలో నాటించారు. మన సొమ్ము మనం తీసికెళ్ళటంలో దొంగతనమేమిటి?' అని భర్తతో చెప్పి తీసికొని వస్తున్నది. కానీ కావలి వాండ్లు మాత్రం దీనిని అపహరణమే అన్నారు. వారు పోయి ఆ సంగతి దేవేంద్రుడితో చెప్పారు. సత్యభామ ఏమనుకున్నా, ఇంద్రుడికి చెప్పకుండా తీసికెళ్ళటం కృష్ణ పరమాత్మకు కూడా అపహరణమే అనిపించింది. అయినా ఇంద్రుడితో యుద్ధం చేసి తీసికొచ్చారు గనుక, అది అపహరణం కాదు.

అయినా పరమాత్మకు కూడా ఒక్క క్షణం ఆ విధంగా అనిపించింది కాబట్టి, నా అంతరాత్మలో కూడా అది ధ్వనించి ఆ పేరు పెట్టాను. అందువల్ల పారిజాత వృక్షం నిజంగా అపహరణం కాలేదు. కానీ నా కావ్యం పేరు మాత్రం పారిజాతాపహరణమే.

పె : రామకృష్ణ కవీ! ఈ విషయాన్ని వింటే నీ మనస్సులో నున్న ఆ అనుమానం పరిపూర్ణంగా నివృత్తి అవుతుంది. విను.

నంది తిమ్మనగారు కావ్యం వ్రాసిన క్రొత్తలో ఒకనాడు నేనూ శ్రీకృష్ణరాయలవారూ, నంది తిమ్మనగారు మేము ముగ్గురమూ మన ఉద్యానవనంలో మాట్లాడుకుంటూ ఉండగా నీవు వేసిన ప్రశ్నే నేనూ వేశాను. దానికి తిమ్మన కవిగారు చెప్పిన సమాధానం యిది: 'పెద్దన కవీ! నేను ఏ కావ్యం వ్రాసినా అది పూర్తి కావటంతోటే దానిని మన వేణుగోపాలస్వామి ఆలయం గర్భగుడిలో పెడతాను. ఆ మరునటి రోజు ఆ గ్రంథం యథాతథంగా ఉంటే దానిని కావ్యంగా ఒప్పుకొని తీసి కొచ్చుకుంటాను. లేక అది దగ్ధమైపోతే ఇక అంతే. ఆ కావ్యము అలా వ్రాయటం స్వామికి యిష్టం లేదనుకుంటాను. ఈ పారిజాతాపహరణ గ్రంథాన్ని ఆయన పాదాలచెంత ఉంచాను. అది ఆ మరురోజు ఉన్నది ఉన్నట్లే ఉంది. అందువల్ల దాని పేరు విషయంలో కాని, దాని రచన విషయంలో కాని నాకే అనుమానం లేదు. ఆ పరమాత్మ కూడా ఒక క్షణం అది అపహరణమే అని అనుకొని యుండవచ్చు. అందువల్ల ఆ పేరు ఆయనకు కూడా నచ్చి యుంటుంది' అని అన్నారు.

అదంతా నాకొక పెద్ద పిచ్చితో కూడుకున్న ప్రక్రియలాగా కనిపించింది 'మీరు కావ్యాన్ని అలా దేవాలయంలో పెట్టి తలుపులు వేయించి వస్తే అది ఉండకేమవుతుంది. ఏమిటో వింతలు చెబుతున్నారు' అన్నాను. 'అది కేవలం మీ భక్తి. మీ నమ్మకం' అని అన్నాను. దానికి రాయలవారు చిరునవ్వు నవ్వారు. అప్పుడు తిమ్మన కవిగారు 'నాయనా! పెద్దనా! భక్తి చూచేవాండ్లకు పిచ్చిలాగానే కనిపిస్తుంది. సరే, నా గ్రంథం పేరు పారిజాతాపహరణం అని పెట్టడం పరమాత్మకు నచ్చి యున్నట్లైతే, అందుకు నిదర్శనంగా ఈ కనిపిస్తున్న పారిజాతం

చెట్టు పూలు మొత్తం అన్నీ రాలి నేల మీద పడతాయి, లేకుంటే అవి అలాగే ఉంటాయి' అన్నారు. అదేమి వింతో, ఆ భగవంతుడి లీల! ఎక్కడా గాలి కూడా లేకుండా పూవులన్నీ జలజలా రాలి నేలమీద పడ్డాయి! అప్పుడు నేను 'అమ్మో, ఈయన దగ్గర ఏదో కనికట్టు విద్య ఉంది' అనుకొని అంతటితో ఊరుకొన్నాను.

పిం : ఊహలలో ఉద్యాన వనాలు చూడటం, పూలు రాలి పోవటం, దేవ కన్యలు దిగి రావటం, మగువ పొలుపు దెలుపు మారుతము వీచటం- ఇవన్నీ కవులకు మామూలే కదండీ!

తె : అందువల్ల ఆ పారిజాతపు చెట్టు పూలన్నీ రాలిన తరువాత బోడిగా కని పించిందంటావు?

పె : మీ కుభయులకు హాస్యంగానే ఉంటుంది. వినండి. జయదేవుని గీత గోవింద కావ్యాన్ని చదివిన నంది తిమ్మన గారికి 'ఆయన సంస్కృ తంలో రాధా మాధవుల శృంగారాన్ని అద్భుతంగా వర్ణించారు. సంస్కృతం చదువుకున్నవారికీ పండితులకూ అర్థమౌతుంది. మనం యిదే విధంగా తెలుగులో వ్రాస్తే దేశ ప్రజలందరికీ ఆ శృంగారం తెలు స్తుంది' అని అనిపించింది. ఆ ఆలోచనతో నంది తిమ్మనగారు రాధా మాధవము అనే కావ్యాన్ని విన సొంపైన తెలుగులో సామాన్య ప్రజల కర్థమయ్యేటట్లు వ్రాశారు. అప్పుడు రాయల వారు మాత్రము - 'రచన అమోఘంగా ఉంది. కానీ, యింతటి పచ్చి శృంగారం తేట తెల్లమైన తెలుగులో నుండటం బాగా లేదు' అన్నారు. దానికి వారు చెప్పిన కారణం 'నియమ బద్ధంగా చదువుకున్న తరువాత ఆత్మకు కూడా నియతి వస్తుంది. ఏ చదువూ చదువుకోనివారికి కూడా యింతటి శృంగారము అర్థమైతే, అది వారి తలకెక్కి కామంగా ప్రకోపిస్తుంది. అందువల్ల ఈ రచన లోక కళ్యాణంకోసం వినియోగపడుతుందని నేననుకోను' అని.

అప్పుడు నేను 'అదేమిటి ప్రభూ! సంస్కృతంలో వ్రాసిన దానిని భగవంతుడు మెచ్చుకున్నాడు. తెలుగులో మన తిమ్మన కవిగారు వ్రాసిన రాధా మాధవుల ప్రణయాన్ని భగవంతుడు తప్పకుండా మెచ్చు కుంటాడు. దానికి మన తిమ్మన కవిగారు పెట్టే పరీక్ష మామూలుగా

ఉండనే ఉంది గదా? అందువల్ల వారు దానిని వేణుగోపాల స్వామి ఆలయంలో పెట్టి అది భస్మం కాకుండా ఉన్నప్పుడు బయటికి తీసికొచ్చిన తరువాతేగదా-లోకానికి పనికివస్తుందా పనికిరాదా అని ఆలోచించవలసినది' అని అన్నాను.

అప్పుడు మన తిమ్మన కవిగారు ఆ కావ్యంలోని తెలుగు పాటలతో పాటు సంస్కృతంలో వ్రాసిన ఒక పాటను కూడా ఉంచి, ఆ గ్రంథాన్ని మన వేణుగోపాల స్వామి ఆలయం గర్భ గుడిలో ఉంచారు. అదేమి వింతో, తెలుగులో వ్రాసిన ఆ కావ్యమంతా దగ్ధమై పోయింది! ఒక్క సంస్కృతంలో వ్రాసిన పాట ఉన్న తాళపత్రం మాత్రం యథాతథంగా ఉంది.

పిం : కల్పించటంలో పెద్దన కవిగారు అనల్ప ప్రజ్ఞా ధురీణులని మాకందరికీ తెలుసు. ఇదంతా నేను నమ్మను. ఆ గుడి పూజారి తగలబెట్టి యుండ వచ్చు. లేక తిమ్మన కవిగారి భార్య తగలబెట్టి యుండవచ్చు. లేదా, ఎవరయినా ఆయనంటే గిట్టని కవులు తగలబెట్టి యుండవచ్చు. వీటన్నిటిలోకి కూడా, వారి భార్యే తగలబెట్టియుంటుందని నా నమ్మకం. నే చెబుతున్నాను వినండి. అవి నా చిన్నతనపు రోజులు. అప్పటిలో వీరితో వీరింట్లో వీరి మేనగోడలుండేది. వీరి మేనగోడల్ని ఆమె భర్త వదిలేశాడు. ఆమె మహా సౌందర్యవతి. నాట్యం అద్భుతంగా చేసేది. తిమ్మన కవీంద్రులు పాట వ్రాసేవారు. ఆ పాట కామె నాట్యం చేసేది. ఆమె నాట్యం చేసేది. తిమ్మన కవీంద్రులు పాట వ్రాసేవారు. నే చిన్న వాడిని కావటంతో వాండ్లను చూచి ఆనందపడటం నా వంతయింది. ఆ మహా కవిలాగా కావ్యాలు వ్రాయాలని నాకూ కోరిక కలిగేది. అందు వల్ల పనిపాట వదిలేసి వారినే చూస్తూ కూర్చొనేవాణ్ణి. వారిద్దరూ కొంత సేపు అలా చేసి వేణుగోపాలస్వామి ఆలయం వద్ద నున్న కొలనులో స్నానం చేసేవారు. వారు భార్యా భర్తలేమో అనుకుండేవాణ్ణి. తరువాత తెలిసింది.... కాదని. నాకు అనుమానం కలిగినట్లే వారి భార్యకు కూడా, భర్తకు శృంగార ప్రకోపం ఎక్కువయి ఆ కావ్యం అలా వ్రాసు కున్నారని అనిపించవచ్చు కదా!. అందువల్ల వారి భార్యే తగులబెట్టి యుండవచ్చు.

నం : నాయనా పింగళీ! నీ వనుకున్నట్లు తార్కికమైన బుద్ధికి అనుమానా లుంటాయి. కానీ విను. మా మేనగోడలికి తల్లి పసితనంలోనే పోయింది. ఆ పిల్లకు ఉగ్గూ పాల దగ్గర నుంచీ నా భార్యే పోసి పెంచింది. నేను ఆ పిల్లకు గోరుముద్దలు తినిపించాను. ఆ పిల్ల ఆలనా పాలనా అంతా మేమే చూచి పెండ్లి చేశాము. చిన్నతనంలో ఈ విజయనగరంలో ఆ పిల్ల సంగీతము, సాహిత్యము నేర్చుకుంది. ఆమె భర్త తిరుగుబోతై ఆమెను వదలివేసిన తరువాత మా హృదయా లెంతో బాధ పడ్డాయి. ఆమెకు చిన్నప్పటి నుండీ వేణుగోపాల స్వామి అంటే అమితమైన భక్తి. ఆమె చిన్నతనంలో చాలాకాలం ఆ ఆలయంలో నాట్యం చేస్తూ గడిపింది. అందువల్ల భర్త వదలిపెట్టిన తరువాత పరమాత్మను భర్తగా భావించుకొని నాట్యం చేసేది. ఆ నాట్యానికి అనుగుణంగా నేను పాట వ్రాసేవాణ్ణి. ఆమె తన జీవితాన్ని పూర్తిగా పర మాత్మకు అంకితం చెయ్యాలనే మానసిక స్థితిలోకి వచ్చింది. అట్టి తరుణంలో నేను వ్రాసిన రాధామాధవము అను కావ్యాన్ని స్వామి వారి ముందు ఆ పని కూన తన చేతులతోనే ఉంచింది. నా భార్య పరమ సాధ్వి. నా మేనకోడలు నా భార్యకు ఆరవ ప్రాణం. ఆ కావ్యాన్ని ఆ రకంగా వ్రాయటం పరమాత్మకే ఇష్టం లేక అది భస్మమయి పోయింది. నీవు నమ్మినా నమ్మకపోయినా యిది యథార్థం. ఆ తర్వాత కొద్ది రోజులలోనే మా మేనగోడలి భర్త వచ్చి, తను ఉంచుకున్న స్త్రీ యిల్లు నిప్పు అంటుకొని కాలిపోయిందని, తను చేసిన తప్పు తెలుసు కున్నానని కాళ్ళా వేళ్ళాబడి మమ్మల్నందరిని బ్రతిమాలి మా మేన గోడల్ని తీసికెళ్ళాడు. మా మేనగోడలు భర్తతో కలిసి వెళ్ళటం నాకెంతో ఆనందంగా ఉన్నా, గ్రంథం ఎందువల్ల కాలిపోయిందో అర్థం కాని నేను స్వామికి ఎక్కడ అపచారం చేశానో తెలియక ఎంతో బాధపడి మంచాన పడ్డాను. అప్పుడు నా కర్థం గాని విషయం పెద్దన కర్థమయింది. ఆ సత్యాన్ని పెద్దన కవీంద్రులే చెప్పాలి.

పె : మంచంలో అనారోగ్యంతో శుష్కిస్తున్న తిమ్మన కవిని చూచిన నాలో ఆలోచన హెచ్చింది. వేణుగోపాల స్వామికి నచ్చంది ఆ కావ్యములోని

పచ్చి శృంగారము అనిపించింది. దానిలోని అంగాంగ వర్ణనలు, అత్యంత వ్యామోహభరిత అనంగ సంగర సంగమాలు పరమాత్మకు నచ్చలేదని నాకనిపించింది. నా దృష్టికి గోచరమైన సత్యాలివి. శ్రీ మహాలక్ష్మీ దేవి, అష్టలక్ష్ముల రూపంలో ఒప్పే ఆ తల్లి, ఎనిమిది అంశలతో పరమాత్మ అష్ట భార్యలగా ఆవిర్భవించింది. మహర్షులు, జగన్మంగళ విగ్రహుడైన పరమాత్మతో ఆడుకోవాలనే కోరికతో గోపికలుగా జన్మించారు. అహల్య రాయియయిన తరువాత, గౌతముడు దేవేంద్రుని కిచ్చిన శాప పర్యవసానంగా, శచీదేవి రాధగా జన్మించింది.

పరమాత్మ భార్యలతో కాపురం చేశాడు. గోపికలతో ఏవిధమైన కామ సంబంధం లేకుండా వారి ఆనందం కోసం బృందావనంలో వెన్నెల రాత్రులలో యమునా తీరంలో ఆడుకున్నాడు. వారికి తన మురళీ రవం వినిపించాడు. రాధ నాట్యం చేసింది. పరమాత్మ వేణువు ఊదాడు. ప్రకృతి పరవశించింది. వారిరువురూ కామాన్ని జయించిన అసాధారణ మూర్తులు. అలౌకికమైన ఆనందాన్ని అనుభవించిన అద్భుతమైన స్త్రీపురుషులు. ఉభయులూ స్వస్వరూపాలు తెలిసిన మహనీయ దేవతా మూర్తులు. వారి హృదయాంతరంలో నున్నది ప్రణవోపాసన కాని ప్రణయం కాదు. శచీదేవి మనస్సు భర్త పరిస్థితిని తలచుకొని దుఃఖంలో మునిగిపోకుండా పరమాత్మ ఆడుతున్న లీల కనిపించింది. మీరు వ్రాసిన కావ్యం ఇందువల్ల నచ్చలేదని నంది తిమ్మన కవి గారికి చెప్పాను.

'నాయనా! నీ వెంతటి అదృష్ట వంతుడవు! భగవంతుని యథార్థ తత్వాన్ని తెలిసికొనగలిగావు!' అని ఆనందించిన తిమ్మనకవి అనతి కాలంలోనే అనారోగ్యంనుంచీ కోలుకున్నారు. ఈ సంగతి రాయలవారికి కూడా తెలుసు.

దూ : పెద్దనగారు ప్రతిచోటా ఏకపత్నీవ్రతాన్నే ప్రతిపాదిస్తున్నారు. ఏది ఏమైనా పరమాత్మ ఎంత బరితెగించి ఆడినట్లు ప్రాచీన గ్రంథాలల్లో కనిపిస్తున్నా ఇలా సమర్థించుకొనిరావటం నాకేం బాగాలేదు.

పె : నాయనా, ధూర్జటీ! ఆ పరమాత్మ ఆ లీల చేస్తూ ఉండంగా ఎవరూ కంటితో చూచినవారు లేరు. ఆయన విశ్వమోహన రూపం ఏ విధంగా

ఎవరికి సాక్షాత్కరిస్తే ఆ విధంగా వారు వర్ణించారు. నా దృష్టికి గోచర మైన దానిని నేను తిమ్మన కవిగారికి చెప్పాను. అది వారికి దివ్యౌషధం లాగా పని చేసింది. నాకు కనిపించిందది. నేను వారికి చెప్పిందది. వారికి ఆరోగ్యం సమకూరటమే నాకు కావలసింది. అది జరిగింది. దాని కోసం ఆ భగవంతుడు నాకా సుందర దృశ్యాన్ని చూపించాడేమో అని నమ్మాను. ఈ జరిగిందంతా కృష్ణ రాయల వారికి, అమాత్యుల వారికి కూడా తెలుసు.

తి : ఆశ లొదులుకున్న నంది తిమ్మన గారిని బ్రతికించిన పెద్దన గారి ఏక పత్నీవ్రత తత్వము అద్భుతమైనది. నాకు అప్పుడప్పుడూ అనిపిస్తూ ఉంటుంది. రాయలు బ్రహ్మ, విష్ణూ, మహేశ్వరుల అవతారమని, వారి ముగ్గురి భార్యలు సరస్వతీ, లక్ష్మి, పార్వతుల అవతారాలనీ, వారు ఈ భారతదేశంలో ధర్మ సంస్థాపన చేయటానికి అవతార మెత్తారని.

కృ : అమ్మో! మన అష్టదిగ్గజాల ప్రభావంతో అప్పాజీ వారికి కూడా కవిత్వము వస్తున్నది. మీ ఆప్యాయత అభిమానంతో నన్నేమైనా చేస్తారు. అప్పాజీ గారి హాస్యాన్ని ఒక ప్రక్కన ఉంచుదాము.

తి : హాస్యము కాదు కృష్ణరాయా! అదొక ఆనందకరమైన ఊహ.

కృ : అది ఏమైనా నే చెప్పేది వినండి. నంది తిమ్మనగారు మహాకవులు. వారి సరస కవిత్వమే మా కుటుంబంలోని కలతలను రూపు మాపింది. వారికి నేనెంతో రుణపడి యున్నాను.

న : అది రాయల వారి రసిక హృదయం వల్ల జరిగిన అద్భుతం. వారికా హృదయమే లేకపోతే నా కావ్యం పారిజాతాపహరణం చెవిటివానిముందు ఊదిన శంఖమయ్యేది.

కృ : నన్ను చెప్పనీయండి. నంది తిమ్మనకవి సహృదయులు. సౌజన్యమూర్తి. నేను ఒకప్పుడు గండపెండేరాన్ని ఎవరో మహాకవికి బహూకరించ వలయునని ఆలోచించుచుంటిని. దానికి ఈ ఆస్థానమునమన్న వారిలో చాలామంది అర్హులే అని నాకనిపించుచుండెడిది. అయిననూ వయో

వృద్ధులైన నంది తిమ్మనగారి కిచ్చుట యుచితమని యనుకొంటిని. ఆ విషయమును నేను వారితో ప్రస్తావించితిని. దానికి ఆయన చెప్పిన సమాధానము - 'పెద్దన వంటి కవిని నేసి జగత్తులో చూడలేదు. దానిని పెద్దన కవీంద్రుల కీయవలసిందే' అని. అది అట్టులే జరుగవలయునని తిమ్మన కవి పట్టుబట్టిరి. అది నాకునూ యుక్తమే అనిపించెను. నంది తిమ్మన వంటి సహృదయుని, కవితా ప్రియుని కలిగిన నా ఆస్థానము భువన విజయము ధన్యమైనదని యనుకొంటిని.

భ : ప్రభూ! నంది తిమ్మన కవిగారు వ్రాసిన రాధామాధవము కావ్యంలో మిగిలి పోయిన రత్నం వంటి ఆ పాటను పాడి వినిపించమని కోరండి.

కృ : తిమ్మన కవీ! భట్టుమూర్తి కవి కోర్కెను తీర్చండి.

నం : వినండి మహారాజా!

సుమధుర మురళీ నాద వినోదం
నందకిశోరం భావయ మనసా॥

యమునా తీరే కుటజ కుటీరే
విహరంతం శిఖిపింఛ మౌళిం ॥సు॥

నీల నీరద శ్యామ శరీరం
హాస లసిత ముఖ రాకాచంద్రం
నవ తులసీదళ దామ శోభితం
ముని జన మానస మందిర వాసం ॥సు॥

గోపీ జన చేలాహృత లీలా
పులకిత హృదయ జలేజ రాజితం
లీలా మానుష విగ్రహ వేషం
శ్రీ లలనా మణి హృదయ విహారం ॥సు॥

వ్రజ సతి హృదయాలింగన లోలం
కృత రతి కేళీ సంగర హేలం
రాధా రమణీ కుచ పరి శోభిత
మృగ మద సౌరభ వాసిత దేహం ॥సు॥

కృ : తిమ్మన కవీంద్రా! మీ పాట భక్తి శృంగార రసమయంగా మనోహరంగా ఉంది. ఆ జగన్మోహన మూర్తియైన మురళీ కృష్ణుణ్ణి అపూర్వంగా వర్ణించారు. మీ మధురమైన సంగీతంతో మా వీనులకు విందు చేశారు. ఈ ఆనంద సమయానికి చిహ్నంగా ఈ ముత్యాల హారాన్ని మీ కంఠ సీమలో నన్ను అలంకరించనీయండి.

(రాయలవారు ఆనందంతో నంది తిమ్మనను ముత్యాల హారంతో అలంకరించబోవుదురు.)

తె : ప్రభూ! మీరు హారం జాగ్రత్తగా వేయండి. నంది తిమ్మనగారి ముచ్చటైన ముక్కు మీకు గుచ్చుకుంటే కష్టం.

(కృష్ణరాయలు నవ్వుతూ తిమ్మన కవిని హారంతో అలంకరించెదరు.)

తి : నంది తిమ్మన కవికీ .. జై, నంది తిమ్మన కవికీ....జై, నంది తిమ్మన కవికీ....జై.

(ప్రజలందరూ కరతాళ ధ్వనులు చేయుదురు)

కృ : భట్టుమూర్తి కవీ! మీరు పూరించవలసిన సమస్య.... సమస్యను చెబుతున్నాను వినండి.

'జో హరి జో ముకుంద యని జోలలు పాడిరి భార్యలయ్యెడన్.'

భ : వినండి ప్రభూ!

శ్రీ హరి బ్రహ్మ శంకరులు చెల్వుగ నా యనసూయ యింటిలో
మోహన ముగ్ధరూపు లయి ముద్దుల బిడ్డల వోలె నొప్పి యు
త్సాహము తోడ నూయలల సంతస మందుచు నుండ వారికిన్
జో హరి జో ముకుంద యని జోలలు పాడిరి భార్య లయ్యెడన్.

పిం : భట్టుమూర్తిగారు ఒక ఊపు ఊపేశారు.

తి : ముగ్గురు మూర్తులూ మాత అనసూయ యింటిలో ముద్దుబిడ్డలై ఉయ్యాలల్లో ఆనందంగా ఉన్నప్పుడు, పార్వతీ, లక్ష్మి, వాణీ ఉయ్యాల లూపారని మీ పూరణ. అంతేనా? జగత్తును మీ కవిత్వంతో జోల పాడారు.

కృ : భట్టుమూర్తి కవి కవిత్వంలోనూ సంగీతంలోను శారదా స్వరూపులు.

తి : కృష్ణరాయా! మన ఆస్థానంలో నున్న కవుల మీద పక్షపాతంతో సమస్య లను సులువుగా యిస్తున్నట్లుంది.

కృ : అప్పాజీ! మన కవులు అసాధారణ ప్రజ్ఞావంతులు. రసమయంగా సమస్యను పూరించటంలో వారికి వారే సాటి.

తి : వారి విషయంలో నా కనుమానం లేదు కానీ, నీ విషయంలోనే నా కను మానం. నీవు పండిత పక్షపాతివి. కవులకు కావలసిన చుట్టానివి. అందు వల్లనే నేను కొన్ని సమస్యలను పట్టుకొని వచ్చాను. కృష్ణరాయా! మిగిలిన కవులకు సమస్యలను నన్నివ్వనీయండి.

కృ : మీరు సమస్యలిస్తారా?!

తి : ఏమిటి వింతగా చూస్తారు? రాయల వారి ఆస్థానంలో రాతి స్థంభాలు కూడా కవిత్వం చెబుతాయి. ప్రాణమున్న నేను సమస్య నడిగేపాటి సరసమైన కవిత్వం కూడా చెప్పలేనా?

తె : అమాత్యులవారు ఈ మధ్య ఒక మధురమైన కవిత కూడా వ్రాశారు ప్రభూ!.... నాకు వినిపించారు. ... వినండి ప్రభూ!

తి : ఏయ్, రామలింగ కవీ!

తె : వినిపించనియ్యండమాత్యా! అది నాకు కూడా క్రొత్తగా ఉంది.

కృ : వినిపించండి రామకృష్ణ కవీ!

తె : వినండి ప్రభూ!

ప్రతి ధ్వని ఒక రాగంగా
ప్రతి రాయి ఒక శిల్పంగా
వినిపించిన విద్వాంసులకు
కల్పించిన శిల్పులకు

ఈ తుంగభద్రా తరంగాలు
ఈ సుందర శిల్పఖండాలు

సాక్ష్యాలు ఆధారాలు
సార్వకాలిక సత్యాలు.

మనాలి రాయల కొల్వులో
వినాలి రమ్యమైన కవిత్వం
కనాలి రాయల కీర్తిని
అనాలి రాయలకూ జై అని.

ప్రభూ! యిదేమి కవిత్వమో కానీ, నా హృదయాన్ని ఆనందంలో ముంచివేసింది.

(కృష్ణరాయలు, కవులూ అందరూ కరతాళ ధ్వనులు చేయుదురు.)

కృ : మన అమాత్యులవారు రాజకీయ శాస్త్రరంగము, మంత్రాంగములలోనే కాక, సులువుగా ప్రజ కర్థమయ్యేటట్లు కమ్మని కవిత్వం చెప్పటంలో కూడా గణనీయమైన ప్రజ్ఞగలవారని ఈనాడు తెలిసికొన్నాను. బహుశా భావి తరాలల్లో మనలాగా లయ కోసం ఛందస్సనే బంధనాలను బిగించి పాండిత్యాన్ని చూపిస్తూ కవిత్వం చెప్పకుండా విశృంఖలంగా స్వేచ్ఛగా గళమెత్తి మనస్సులోనున్న మహితమైన భావాలను మానవజాతి మనుగడ కోసం ప్రజా బాహుళ్య అభ్యుదయం కోసము తేటతెల్లమైన తెనుగులో సూటిగా చెబుతారని ఊహిస్తున్నాను. నా ఊహ నిజమవుతుందని విశ్వసిస్తున్నాను. మన అమాత్యుల వారి కవిత భావి తరాల వారి కవిత్వానికి మంగళగీతం పాడుతున్నది.

తి : కృష్ణరాయా! కవులారా! నన్ను పొగడటం ఆపండి. దయచేసి నా సమస్యను వినండి. మీలో ఎవరైనా పూరించండి : నా సమస్య-

'స్త్రీలోలుండని మిమ్ము మెచ్చెదరు గావే కృష్ణరాయాధిపా.'

కృ : అమ్మో! మీ సమస్యలో నన్నిరికించారు. నేను ఈ అపవాదు నుండి బయట పడటం కష్టమే అప్పాజీ!

పె : ఇది చాలా సులువైన సమస్య ప్రభూ! నా పూరణ వినండి.

హేలన్ భావ పరంపరా కలనతో నింపారు వాగ్జాలమున్
గ్రాలన్ జేసి రసంబు చిప్పిల మహా కావ్యంబులన్ వ్రాయు ది
క్పాల వ్రాతము బోలు సత్కవుల సాకన్ సజ్జనుల్ సాహితీ
శ్రీలోలుండని మిమ్ము మెచ్చెదరు గాదే కృష్ణరాయాధిపా!

తి : పెద్దన కవీంద్రులు చాలా సామాన్యమైన విషయాన్ని చెప్పారు.

పె : ఇది సామాన్య విషయం కాదమాత్యా! ఎన్నో శతాబ్దముల క్రితము ధారా నగరమున భోజుని యాస్థానమున జరిగిన దానికన్నా మిన్నగా నేడు మన విజయనగరమున కళా పోషణ జరుగుచున్నది. పద్యము పాడని నోరు, నాటక మాడని యూరు మన రాజ్యమున లేదు. మన రాజు ఆంధ్ర భోజు డమాత్యా! మన రాజు ఆంధ్రభోజుడు. నవ్యమైన భావములతో మనోహరమైన శబ్దములతో తీయని ద్రాక్షా గుళుచ్ఛముల రసముతో అమృతోపమానముగా స్వతంత్ర కావ్యములను వ్రాసిన మమ్ములను పోషించుచున్న ఈ మహారాజును సాహితీ శ్రీలోలుడని జనులు మెచ్చు కొనుట సామాన్య విషయమా?!

పల్లీయుల ఆనందము కొరకు మన కవులు భారత భాగవతముల నాధారముగా జేసికొని వ్రాసియిచ్చిన నాటకముల సంఖ్య అసంఖ్యాకము. అట్టి దృశ్య కావ్యములను చూచిన మన ప్రజల హృదయములలో నుద్భవించిన సంస్కృతి యనుపమానము. వారిలో వెల్లివిరియుచున్న చైతన్యము అసమానము. మన కవుల మహత్తరమైన సాహితీ ప్రక్రియల వలననే, కర్షకులు, కార్మికులు శ్రమ యనునది ఎరుగకుండా పనిచేయు చున్నారు. సంఘము ధర్మబద్ధమై యలరారు చున్నది. సైనికులు యుద్ధరంగమందు వీర విహారము చేయుచున్నారు. సరసమైన సాహిత్య మును పోషించని స్సామ్రాజ్యము శ్మశాన సదృశమని మీరెరుగరా? ఎందులకు మీ నోటితో మీరు నే చెప్పిన విషయము సామాన్యమని యను చున్నారో నా యూహ కందకుండా నున్నది!

అమాత్యులు వారి మనస్సు ఏదియో ఆలోచించుచూ యిట్టుల నని యుండవచ్చునని నేను పరిపూర్ణముగా విశ్వసించుచున్నాను.

తి : ఆవేశ పడకుడు పెద్దన కవీంద్రా! మీ పూరణ సుమనోహరముగా నున్నది. కానీ, మీరు చెప్పిన విషయ మసాధారణమైనదైననూ, మన యాస్థాన మున, మనదేశమున సర్వ సాధారణముగా జరుగుచుండుటచే నాకది సామాన్యమైన విషయమని యనిపించినది. భారతీయ సంస్కృతి రక్తములో పరవళ్ళు త్రొక్కుచున్న మహా కవులు అట్టి కావ్యములనే వ్రాయుదురు. ఇట్టి విద్వాంసుడు, మహా కవియునైన మహారాజు అట్టి కవులను కంటికి రెప్పవలెనే పోషించును. ఇందు విశేష మేమున్నది? మహాకవులలో కొందరు మహనీయులు, సమస్య నడిగినవారి మనస్సులో నున్న ఆనందకరమైన యూహను అంతర్దృష్టితో గ్రహించి మహదానందముగా పూరింతురు. అట్టి పూరణ విని ఆనందింపవలయునని నేను కుతూహలపడుచున్నాను.

కృ : అమాత్య వర్యా! సమస్యను సరసమైన భావముతో పూరించుటయే కాక అడిగిన వారి యాంతర్యమును గ్రహించి పూరించ వలయునను కోరిక ఈ కవితా ప్రక్రియను మరింత జటిలమొనర్చుచున్నది.

తె : అప్పాజీ వారి కోర్కె తీర్చుట నా వంతు ప్రభూ! మహామంత్రి ఈ సమస్యను నా కొరకే యిచ్చినట్లున్నది. నా పూరణ వినండి.

ఏలా యింటికి రాడు రేడు పురిలో నే రాచ కార్యమ్ముతో
కాలక్షేపము సేయునో యనుచు మీ కాంతల్ విచారించుచోన్
ఆలోచించిన మంత్రివర్యులట దేవా చింతలన్యాప స్వ
స్త్రీ లోలుండని మిమ్ము మెచ్చెదరు గాదే కృష్ణరాయాధిపా.

తి : ఏ రాచ కార్యంతో ఉన్నారో, ఇంకా రాలేదు స్వామి అని ఆలోచించే రాయల వారి భార్యలకు 'అమ్మా! మీరంటే ఎంత ఆపేక్ష. మిమ్ములను వదిలి ఒక్క క్షణం కూడా ఉండలేడు. నిజంగా ఏదో అవసరమైన పని మీద ఉండుంటాడు' అని నేను చెబుతున్నానని దీని భావం - అంతేనా రామకృష్ణ కవీ?

తె : అవును మహామంత్రీ!

తి : చూడండి కృష్ణరాయా! సమస్యలో మిమ్మలను ఇరికిస్తే పూరణలో నన్నిరికించాడు రామలింగ కవి. ఎక్కడెక్కడ విషయాలపైననో ఒక కన్నువేసి ఉంచుతాడు.

పె : ఇదియా మీరు కోరుకొన్న చమత్కారము!....పూరణ మహదానందముగా నున్నది.

తి : రామభద్ర కవీ! ఈ సమస్యను మీరు పూరించండి.
సమస్య - 'రతిపతి సామవేదమును రమ్యముగా వచియించె నచ్చటన్.'

అ : వినండి మహామంత్రీ!

అతులిత భక్తి వెంకట నగాగ్రముపై విలసిల్లు విష్ణువున్
సతతము చూడవచ్చు విధి శంకర ముఖ్యులు వారి భార్యలున్
చతురత నాట్యమాడు తరి చక్కని గాత్ర సుఖమ్ముతోడ బా
రతిపతి సామవేదమును రమ్యముగా వచియించె నచ్చటన్.

తి : తిరుమల గిరిపై నున్న వెంకటేశ్వర స్వామిని దర్శించ వచ్చిన బ్రహ్మ, ఈశ్వరుడు మొదలైన వారు, వారి భార్యలూ, నాట్యం చేసే సమయంలో భారతి పతి, అంటే బ్రహ్మ, సామవేదాన్ని గానం చేశాడని దీని యభిప్రాయం - అంతేనా?

అ : అంతే అమాత్యా!

తి : ఈ పద్యముతో రేపు తిరుమలగిరిపై జరుగనున్న బ్రహ్మోత్సవములను ప్రభువులవారికీ, ప్రజలకూ జ్ఞాపకము చేయుచున్న మీ పూరణ అద్భుతముగా నున్నది.

మల్లన కవీ! మీరు పూరించవలసిన సమస్య....

'కాంతా రమ్మని తల్లి తోడ బలికెన్ కర్ణంబులో మెల్లగన్.'

మ : వినండమాత్యా!

ప్రాంతమ్మందున నొక్క పల్లెయును చేరన్ కానగారాదు దు
ర్దాంతమ్మయ్యెను దప్పి యాకలని దీరత్వమ్ము కోల్పోవునా
కాంతన్ కుంతిని గాంచి ధర్మజుడు శోకమ్మాపగా ఘోరమౌ
'కాంతారమ్మ'ని తల్లితోడ బలికెన్ కర్ణంబులో మెల్లగన్.

తి : అరణ్యంలో వెళుతున్నప్పుడు కుంతి ఆకలికి దప్పికకూ ఓర్చుకోలేక దుఃఖించే పరిస్థితిలో నున్నప్పుడు ధర్మరాజు 'అరణ్యం' అని మెల్లగా చెవిలో చెప్పాడా? మీ పూరణ అద్భుతంగా ఉంది.

ఇంక ఈ సమస్య, పింగళీ! మీ వంతు. సమస్య వినండి.

'భార్యకు నల్లుడయ్యె మునివర్యులు చిత్తము నందు మెచ్చగన్.'

పిం : ఎన్నో జన్మల అనుబంధాన్ని యింపుగా చెప్పమని మీ అభిప్రాయ మమాత్యా! పద్యం వినండి ప్రభూ!

ఆర్య వినుండు లక్ష్మి తన యక్క ధరాసతి గర్భమందు స
త్కార్యము భర్త సేయుతరి తానుదయించెను కార్మి, రామభూ
వర్యుడు గౌరి నాథు విలు భంగము జేసి ముదాన లీలగా
భార్యకు నల్లుడయ్యె మునివర్యులు చిత్తమునందు మెచ్చగన్.

తి : మీ కళాపూర్ణోదయం కావ్యంలాగా ఈ పద్యం కూడా గజిబిజిగా ఉంది నా బుద్ధికి.

తె : అల్లసాని వారి అల్లిక జిగిబిగీ, పింగళివారి కల్పన గజిబిజీ మామూలే అమాత్యా!

భ : ఈ సమస్య క్లిష్టమైన సమస్య మహామంత్రీ! అయినా సూరనకవి అద్భుతంగా పూరించాడు.

పిం : అమాత్యవర్యుల కర్థమయ్యేటట్లు దీని భావం నే చెబుతాను. అప్పుడు వారే శబాష్ అంటారు.

లక్ష్మి తన అక్కయైన భూదేవి గర్భవాసాన పుట్టటం కోరింది. శ్రీ మహావిష్ణువు రావణ కుంభకర్ణాది రాక్షసులను సంహారం చెయ్యటానికి రామావతార మెత్తినప్పుడు, సీత భూ సుతగా పుట్టింది. భూమి తల్లి, సీత కూతురు, రాముడు భర్త. భూమి విష్ణువుకు భార్య. అందువల్ల భార్యకు నల్లుడయ్యె మునివర్యులు చిత్తమునందు మెచ్చగన్. సరిపోయిందమాత్యా! ఇది రసమయమైన పూరణే.

తి : విప్పి చెప్పావు గాబట్టి తెలిసింది పింగళీ! బాగా చెప్పావు. బ్రహ్మానందంగా ఉంది నీ పూరణ. కానీ కృష్ణరాయా! ఇట్లాంటి గజిబిజి సమస్యను నేను కూడా ఇవ్వకూడదేమో!

కృ : ఏంలేదు. సులువుగానే ఉంది అప్పాజీ!

తి : మన కిద్దరికీ అర్థమైతే చాలదు గదా! మన ప్రజల కర్థం కావాలిగదా!

కృ : మన దేశంలో నున్న ప్రజలు సాహితీ చర్చలలో మనతో పోటీ పడగలరు అమాత్యా.

తి : యథారాజా తథా ప్రజా. అంతే నంటావా?

కృ : అంతే అప్పాజీ!.... కవీశ్వరులారా! సమస్యలను సరసంగా పూరించారు. మీ సమయస్ఫూర్తి యనుపమానము. ఇక తరువాత విషయం వర్ణన.

కనులకు గట్టిన యట్టుల
మనసులు పులకింప భావ మాధుర్యముతో
తనువులు పరవశమందగ
పొనరింపుడి వర్ణనల నపూర్వ విధానన్.

మహా కవులారా! సూర్యోదయ సమయాన్ని, ఆరు ఋతువులను, సూర్యాస్తమయం నుండి చంద్రోదయం వరకూ ఉన్న సమయాన్నీ మనోహరంగా వర్ణించండి.

తి : కృష్ణరాయా! ఇది చాలా మామూలు ప్రశ్న. మన కవులు వారి కావ్యాలలో చేసిన సూర్యోదయ సూర్యాస్తమయ ఋతు వర్ణనలు అద్భుతమైనవి ఎన్నో ఉన్నాయ్. వాటినే మళ్ళీ మళ్ళీ చేయమనటంలో మీ ప్రశ్నలో నాకేం పస కనిపించటం లేదు.

కృ : అప్పాజీ! ఒక్కసారి ఈ విషయాన్ని మీ అంతరాత్మలో ఆలోచించండి. ఉదయాస్తమయాలు, ఋతువులు భగవంతుని లీలలో ఒక భాగం. వాటి సౌందర్యం ఎందరు ఎన్నివిధాల వర్ణించినా యింకా యింకా చూడాలనీ వినాలనీ అనిపిస్తూనే ఉంటుంది. అవి లోక చక్రానికి ఆకులు. కవుల ఆనందానికి అవధులు. అప్పాజీ! వారిని వర్ణించనీయండి.

పె : వినండి ప్రభూ! సూర్యోదయాన్ని వర్ణిస్తున్నాను.

ఇనుడుదయాచలంబుపయి హేమ కిరీటము వోలె దోచె సం
జనిత కుతూహలంబున కుజంబుల పైనను పాడె పక్షుల
య్యనువున నాట్య మాడెను లతాంతము లుల్లము లుల్లసిల్లగా
జనములు కార్య సాధనకు సాగిరి మోములు పద్మపంక్తిగాన్.

నా పద్యంలో నున్న సొగసు ప్రజల కర్థం కావటానికి కొద్దిగా వివరణ నిస్తాను. సూర్యుడు ఉదయ పర్వతంపై బంగారు కిరీటం లాగా ఉన్నాడు. సంతోషంతో పక్షులు చెట్లపై పాడుతున్నాయ్. పూవులు నాట్యం చేస్తున్నాయ్. ప్రజలు, వారు నిత్య కృత్యంగా చేసే పనులకు సాగారు. ఆ సమయంలో వారి ముఖాలు పద్మాల వరుసలాగా ఉన్నాయ్. ప్రభూ! 'మిత్రో జనాన్ చేతయతే' ఇది వేద ఋక్కు. సూర్యోదయంతో మనుషులకు చైతన్యం కలుగుతుందని ఈ వాక్కు అర్థం. ఆ సమయంలో మనస్సులలో క్రొత్త క్రొత్త పనులను చైతన్యవంతంగా చేయాలనే అభిప్రాయం కలుగుతుంది. అందుకే జనుల ముఖాలు విచ్చుకున్న పద్మాల లాగా ఉన్నయని చెప్పాను.

కృ : పెద్దన కవీంద్రా! మీరు సూర్యోదయాన్ని ఎంతో ముచ్చటగా వర్ణించారు.

నం : వసంత ఋతువును నేను వర్ణిస్తాను ప్రభూ! వినండి :

చివురాకు సౌరుతో చెలగు వృక్షాగ్రము
లజ్జతో విలసిల్లు రమణియయ్యె
ప్రసుపు క్రొంబూతతో పసమీరు లేమావి
కొమ్మ చెలువగు పెండ్లి కూతురయ్యె
సురభిళ మెగజిమ్ము సురుచిర సుమపంక్తి
సుందర కన్యకా బృందమయ్యె
కలకంఠ రావముల్ పలుకు పుంస్కోకిల
సంగీత విద్వాంస సరణి నొప్పె
కుతుక మెగయగ మలయ మారుతము వీచె
తీయ తీయని యూహలే యూయలూచె
భువియె దివియైన చందాన ముదము దోచె
సరసమై వచ్చె నిలకు వసంత ఋతువు.

ఈ పద్యంలోని మనోహరమైన భావం యిది. చివురాకులతో నున్న చెట్టు సిగ్గుతో కూడుకొన్న స్త్రీ ముఖంలాగా, పూచిన మామిడి కొమ్మ పెండ్లి కూతురిలాగా, సుగంధంతో విరాజిల్లే పువ్వులు అందమైన ఆడపిల్లల సమూహంలాగా, తీయగా పాడే కోకిల సంగీత విద్వాంసుని లాగా ఉన్న సమయంలో సంతోషం ఉప్పొంగుతున్నది. చల్లగా గాలి వీస్తున్నది. జనులు ఊహల ఉయ్యాలలో నూగుతున్నారు. భూమి స్వర్గమైంది. అప్పుడు వచ్చింది వసంత ఋతువు.

కృ : వసంత ఋతువును మనోహరంగా వర్ణించారు.

ధూ : గ్రీష్మ ఋతువు - ఎండాకాలాన్ని, నేను వర్ణిస్తాను ప్రభూ, వినండి!

అందయు నాపు లేని జనులల్లల నాడగ వేడి గాడ్పుతో
బండలు బ్రద్దలయ్యె తన వారల గాంచిన భూమి తల్లికిన్
గుండెలు బీటవారె తనకుంగల యామ్రమ ఫలాల దెచ్చి రా
రండని యిచ్చె నందరికి ప్రాణము నిల్పగ గ్రీష్మ మందునన్.

ప్రభూ! ఆ సమయంలో నిలువ నీడలేని జనులు తల్లడిల్లి పోతున్నారు. వారిని చూచి బండలు బ్రద్దలవుతున్నాయ్. భూమి అన్నిచోట్లా పగుళ్ళేర్పడ్డాయ్. ఆ దృశ్యం, భూమి తల్లి గుండెలు బ్రద్దలైనట్లు కనిపిస్తున్నది. చెట్లు మామిడి పండ్ల నిస్తున్నాయ్. ఆ సన్నివేశము ఎండకు బాధపడుతున్న తన బిడ్డలపై జాలితో భూమి తల్లి అందరికీ 'రండి రండి' అని పిలిచి మామిడి పండ్లను పంచి యిస్తున్నట్లుగా ఉంది.

కృ : మండిపోయే ఎండాకాలాన్ని కూడా మహా మధురంగా వర్ణించారు ధూర్జటి కవి.

ధూ : వర్ష ఋతువును నేను మూర్తీభవింప చేస్తాను ప్రభూ!

ధారుణి మండు చుండెనని తల్లెడమందు నదీ నదాలలో
నీరము లింకి పోవగని నిశ్చల రీతిని యూరకుండగా
నేరని వాసవుండు తననే కొని యాడెదు వారు మేఘము
ల్హారము పాడిరోయన దయార్ద్రిత జూచెను కుంభవృష్టితోన్.

ఎండ వేడిమికి భూమి మండిపోవటాన్ని చూచిన నదులలో సము ద్రాలలో నీరు ఇంకిపోయింది. బాధపడుతున్న వారిని చూచి జాలిపడటం ప్రకృతి సహజం. ఆ పరిస్థితిని చూచి దేవేంద్రుని హృదయం కరిగి పోయింది. ఎవరో భక్తులు ఆయనను మేఘమల్హార రాగము పాడి ఆనందపరచినట్లైంది. మేఘాలకు రాజయిన దేవేంద్రుడు కుండపోతగా వర్షం కురిపించాడు ఇది ఈ పద్యంలోని భావం.

తి : భట్టుమూర్తి కవి వర్షాకాలాన్ని అమోఘంగా వర్ణించారు.

పిం : భట్టుమూర్తి కవీ! మీరు సంగీతము, సాహిత్యము రెండింటనూ అసమాన పండితులు. ఇయ్యది మా అదృష్టము. మేఘ మల్హార రాగాన్ని విని పించండి. ఆనందంగా వినాలని ఉంది.

పె : ఇది సమయము కాదు. ఇయ్యది సాహిత్యగోష్ఠి జరుగుతున్న సభ.

పిం : సంగీతము, సాహిత్యము రెండును శారదామూర్తి రెండు కన్నులు. ఒంటి కంటి వానివలె మనము ఒక కంటితోనే లోకమును చూచుచున్నాము. భట్టుమూర్తి రెండు కన్నులతో ఆ తల్లి లోకాతీత సౌందర్యమును చూడ గలిగినవాడు. ఆయన మేఘమల్హార రాగము పాడుటకు మీ కెందుల కభ్యంతరమో నాకు తెలియకున్నది. ఇది యంతయూ అసూయవలన జరుగుచున్నదని నా యనుమానము. ఇంతటి మత్సరము పెద్దన కవీంద్రుల వంటి పెద్దలకు తగదని నా మనవి.

భ : పాడుటకు నాకేమీయూ అభ్యంతరము లేదు. ఆ రాగ ప్రభావమున వర్షము విపరీతముగా కురిసిన, ఈ సభకు విచ్చేసిన జనులు ఇండ్లకేగలేక యిక్కట్ల పాలౌదురేమోయని నా యనుమానము.

పిం : మీరు ఎంత శ్రావ్యముగా పాడిననూ, వర్షము వచ్చునని నేననుకొనను. సంగీతశాస్త్ర గ్రంథములలో నా విధముగా వ్రాసి యుండవచ్చును కాని అది యథార్థముగా జరిగెడి పని కాదు. ఆనందంగా ఆలపించండి.

ధూ : నీకు మంత్రముల ప్రభావముపైననూ, రాగముల శక్తిపైనను విశ్వాసము లేకుండి యుండవచ్చును. శారదామాత దయచేత కవితా ప్రాభవము సంప్రాప్తించినదని పరిపూర్ణముగా విశ్వసించు నీవు ఈ విధముగా మాటాడుట అనుచితము.

పిం : ఆర్ష సంప్రదాయమును గురించి మీరు చెప్పవలసిన యధోగతి నాకింకనూ పట్టలేదు. అట్టి సంప్రదాయములపై గల సముచిత విశ్వాసముతోడనే యింతవాడనయితిని. చిత్తశుద్ధి లేని శివపూజలు చేయు మీవంటివారు నాకు నీతులు చెప్పవలసిన యవసర మెంతమాత్రమూ లేదు.

తె : ఇది పంటలు పండి, ధాన్యమంతయూ పొలముల మీద నున్న కోతల సమయము. రాగము పాడుట వలన వర్షము కురిసిన హాని కలిగి దేశారిష్టము సంభవించునని పెద్దన గారి యభిప్రాయము.

పిం : మీరునూ కోతలు కోయుచున్నారు. మీ కందరికీ ఒకటే పిచ్చి....మూఢ నమ్మకము.

తి : కృష్ణరాయా! ఈ సభా మండపము రణరంగముగా మారుచున్నది. మన కవులు, సాహిత్య రంగముననే కాక సమర రంగమున కూడా అందె వేసిన చేతులవలె నున్నారు.

దూ : పాడనీయండి ప్రభూ!

కృ : ధర్మము తప్పని మన రాజ్యపాలనలో మన దేశమున కేయుపద్రవములు కలుగవని నేను నమ్ముచున్నాను. భట్టుమూర్తి కవీ! మల్హార రాగాన్ని మధురంగా పాడండి.

భ : ప్రభూ! తమరు పాడమనుచున్నారా!

పిం : పాడమనియే కోరుచున్నారు.

కృ : పాడండి, పరవాలేదు. పరమాత్మ మన రాజ్యమును ఎల్లప్పుడునూ రక్షించుచునే యుండును.

(భట్టు మూర్తి కవి మల్హార రాగమును పాడును. జనుల కరతాళ ధ్వనులు మిన్నుముట్టును.)

కృ : ఎంత అద్భుతముగా పాడితిరి! ఎంత అద్భుతముగా పాడితిరి! భట్టు మూర్తి కవి కేవలము పురుషరూపముననున్న శారదాదేవి అవతారము. సంగీత సాహిత్యములు రెండునూ అతని సొత్తు. అమాత్యా! తెప్పించండి ....రత్న మణి మయ సువర్ణ కంఠ హారమును. ఏ కంఠముతో శ్రావ్యముగా మన యందరి వీనులకు విందొనర్చెనో, ఆ సుధామయ మూర్తి దివ్యవాణికి అంజలి ఘటియించుట ఈ రాయల పూర్వజన్మసుకృతముగా భావించుచున్నాను.

(తిమ్మరుసు రత్న మణి మయ హారమును తెప్పించును. దానిని రాయలవారు భట్టుమూర్తి మెడలో నలంకరింతురు.)

భ : (ఆనందముతో)

సకల క్ష్మాతల పాలనా చతుర శ్రీశా సర్వ విశ్వంభర
ప్రకటీ భూత సమస్త వస్తు మయ దేవా శంకరా సామగా
న కళా లోల విరించి మీరలు ధరన్ సామ్రాజ్యమున్ సేయగా
నకలం కోజ్వల కృష్ణరాయ మహిచంద్రాకారమున్ గంటిరే!

పె : సుకవీ! నీకు నా శుభాశీస్సులు. ఈ నాటి నుండి నీవు రామరాజ భూషణు డను పేరుతో విలసిల్లుము.

కృ : రామరాజ భూషణ కవికీ....జై, రామరాజ భూషణ కవికీ....జై, రామ రాజ భూషణ కవికీ....జై.

(ప్రజలు జయ జయ ధ్వానములు చేయుదురు.)

అ : చూడండి ప్రభూ! ఆకాశము ఉద్ధృతముగా మేఘావృతమైనది.

భ : వర్షము వచ్చు చున్నది ప్రభూ!

పిం : పిడుగుల ఫెళ పెళార్భటి హెచ్చయినది ప్రభూ! కత్తులు దూసినట్లు తళ తళలు వియత్తలము నందతటనూ కప్పుచున్నవి ప్రభూ!

భ : వర్షము తథ్యము.

(వర్షము తీవ్రముగా పడుచున్న ధ్వనులు వినిపించును.)

పిం : (కన్నుల నీరు నిండగా) ఇంతటి తీవ్ర వర్ష పాతమునకు నేను కారకు డను ప్రభూ!....నేను కారకుడను. ప్రజలు పరువులెత్తు చున్నారు. పశు గణములనూ, పండిన పంటచేలనూ రక్షింప నుపాయము కనిపింపక యున్నది ప్రభూ!

తె : భట్టుమూర్తిగారు మరల నేదైన రాగమును, వర్షమును మరలింప, పాడ గలరేమో!

భ : నావల్లకాదు రామలింగ కవీ! ఒకసారి మేఘమల్హార రాగమును పాడిన తరువాత, అది దాని ప్రభావమును చూపింపక తిరోగమింప చేయుటకు నేను సమర్థుడనుకాను.

పిం : నే చేసిన పాపమునకు నిష్కృతి లేదు ప్రభూ! నే చేసిన పాపమునకు నిష్కృతి లేదు.

నం : ఇది ఆవేశపడి ఏడ్చుటకు సమయముకాదు. ఆలోచనతో మీ బుద్ధికి పదును పెట్టుడు.

తె : పింగళివారు పెట్టవలసిన పదును ఎప్పుడో పెట్టిరి.

నం : పెద్దనగారూ! మీరు పెద్దవారు, పరబ్రహ్మ మీ యందున్నాడు. మీరాలోచించిన ఏది యేని ఉపాయము తోచక మానదు.

పిం : క్షమింపుడు పెద్దన కవీంద్రా! దారి చూపింపుడు.

పె : (ఒక్క క్షణమాలోచించి) స్థంభీభూతుడైన ఈ ధూర్జటి కవియే దీనికి సమర్థుడు. శంకర పాదపంకజ స్మరణా నిరతుడైన ఈ ధూర్జటి పరమేశ్వరునకు విన్నవించిన పశుపతి కరుణించునని నేను నమ్ముచున్నాను. ధూర్జటీ! కాలము మించిపోనీయక కాలకంఠునితో విన్నవించుము.

మ : ఏమట్టుల చలన రహితముగా నున్నారు! ప్రళయమువలె ప్రపంచమును ముంచివేయుచున్న వర్షము మీకు కనిపించుట లేదా?

అ : కరుణతో ఆలోచించండి ధూర్జటి కవీంద్రా!

తె : అనుదినమూ నిన్ను చూచుచుందును గనుక, హాస్యమునకేదియో అనుచుందును. ఈశ్వర పాద భక్తులైనవారు, ఎట్టి కాల కూట విషమునైననూ భరించి, లోక కళ్యాణమే చేయుదురు. నీవిందుకు భిన్నము కావని నేనను కొందును. నీవు నిజమైన శివభక్తుడవో కావో ఈ క్షణమున తేలిపోవును.

తి : ఇందరు ఇన్ని రకములుగా చెప్పుచున్నారు. మీపై ఆశతో నున్నారు. మా ఆశలను వమ్ము చేయకండి.

కృ : మహాత్ముల మనస్సు వెన్నకంటే మృదువైనది. వారి వాక్కు కత్తి వాదర కంటే పదునైనది. ఈ విషయము లోక మంతటికీ విదితమే.

ఈ వర్ష ధారా పాతమును నిరోధింప మీరే సమర్థులు. ధూర్జటి కవీంద్రా! చేయండి శివస్తవం.

ధూ : కైలాస నాథ హర శంకర దీన బంధో
కాత్యాయనీ మానస పద్మ మిత్రా
శ్రీరాజతాచల నివాస విహార శంభో
త్రాయ స్వమాం త్వత్పద పద్మ దాసం.

హర మహేశ్వర కన్నులు తెరచి చూడు
జంగమ స్థావరములు ప్రచండమైన
వర్ష ధాటికి ఘూర్ణిల్లు పశుపతీశ
జగములను కావ రమ్మిక జాగువలదు.

వినిపింపవా నాదు విన్నపమ్ముల నీకు
హర నీలకంఠ మహాను భావ
కనిపింపవా నీకు గగనమ్ములో నుండి
పడు వర్ష ధారలు పార్వతీశ
తలపోయవా యిట్టి దారుణ విధ్వంస
కాండ కూడ దటంచు గరళ కంఠ
మది నెంచవా నీవు మామక భక్తుడౌ
ధూర్జటి పిలు పంచు దురిత దూర

ఏమి వరుణుండు నీమాట స్వామి వినడ
వాసవుడు నీకు బెదరడ వర్ష మింక
ఆగదా యిట్టి యాగడ మనఘ యెటుల
సైప నేర్చితి శంకరా ప్రశస్త చరిత.

చటుల తర వర్ష మిట్టుల
నిటలాక్షా కురియుచుండ నీ విట్టుల మా
కట కటలు గనక ప్రళయో
ద్భట తాండవ లీల నాడ భద్రమ రుద్రా

ఏను భవత్పదాబ్జముల నెప్పుడు చిత్తము నందు నిల్పి నిన్
ధ్యానము చేతునేని తవ దాసుని ధూర్జటి సత్కవీశునిన్
పూనిక బ్రోవగా కరుణ పుట్టిన వేగమె రమ్ము యిట్టి వ
ర్షాన జగమ్ము ముగ్గుతరి శర్వ పరాత్పర శంకరా హరా!

పిం : ప్రభూ! మేఘాలు తగ్గినాయి. వర్షం వెలిసింది. ఈ విధంగా విశ్వ కళ్యాణం చేసిన ధూర్జటి మహా భక్తుడు ప్రభూ, మహా భక్తుడు! ఇందు నే చేసిన అపరాధాన్ని మన్నించండి ధూర్జటి కవీంద్రా!

మహా భక్తులైన మిమ్ములను అనరాని మాటలన్న నా నాలుకను ఖండ ఖండములుగా ఖండించినను తప్పులేదు. మహాప్రభూ! నాకా దండన విధించండి.

ధూ : పింగళీ! ఇది ఏమి వెఱ్ఱి? కమ్మని కవిత్వము చెప్పగల నీ నాలుకకు, మహా కవియూ ధర్మమూర్తియు అయిన మన రాజు అట్టి దండన ఈయగలరా? తప్పు చేసినవారు హృదయ పూర్వకముగా పశ్చాత్తాపముతో తప్తమైన పరమేశ్వరుడు వారి పాపమును భస్మీభూతమొనర్చును. నిన్నూ, నన్నూ మన్నించేవాడు సర్వేశ్వరుడు. పింగళీ! లోక కళ్యాణం చేసేవాడు దయా మయుడు శంకరుడు. నీవూ, నేనూ నిమిత్త మాత్రులం. పరాత్పరుడు, పతిత పావనుడూ అయిన ఆ పరమేశ్వరుని పాదములే మనకు శరణ్యం.

హే నీలకంఠా మహాదేవ శంభో హరా శంకరా దీనబంధో కృపా సాగరా భక్త కల్పద్రుమా కృత్తివాసా భవానీ పతే సర్వ సర్వంసహా చక్ర నిర్వాణ సంధాయకా సర్వ గీర్వాణ సంసేవితా సర్వ జీవాంత రాత్మ ప్రభా భాసితా భూతనాథా శివా చంద్రరేఖా సుధా పూర స్మేరాం కురా రంగదుత్తుంగ గంగా తరంగానుషంగాను మోదా శుభాంగా భవా దివ్య భస్మాను లేపోత్తమాంగా విభూతి ప్రదా సర్వ సంసార మాయాంధ కారా వినిర్ముక్త చిద్రూప వేదాంత వేద్యా జగన్నాయకా పాహిమాం పాహిమాం పాహిమాం.

(కనులకు కనుపట్టు శివునకు ధూర్జటి నమస్కరించును.)

పిం : పెద్దన కవీంద్రా! మీరు చెబుతున్నా వినకుండా, భట్టు మూర్తిని మేఘ మల్హార రాగం పాడమనటం నే చేసిన మహాపరాధం.

పె : నాయనా పింగళీ! నీవు నిజముగా పండితుడవు, మహాకవివి. నీ పాండిత్యమునకు తోడు వినయ మలవరుచుకొనుట అవసరము. వినయము లేని విద్య లోకమున కపకారము చేయును. వినయము గలిగిననాడు నీవు లోకమునకు పెన్నిధి వంటి వాడవు

తె : పింగళి సూరన గారి కిట్టి మాటలు రుచించునని నేననుకొనను. ఒకరు వారిముందు తలవంచవలయునే కాని, వారు మరియొకరి ముందు ఎన్నడునూ తల వంచరు.

పిం : మరెన్నడూ యిటుల మాటాడనని శ్రీకృష్ణ దేవరాయలవారి పాదముల ఆనగా ప్రమాణము చేసి చెప్పుచున్నాను.

పె : పింగళి సూరన కవీ! నీవు ఈనాటి నుండి సార్థక నామధేయుడవు. నీకు నా శుభాశీస్సులు. దీర్ఘాయురస్తు. ( చేయియెత్తి దీవించును.) రామలింగ కవీ! హాస్యమునకొక అవధి యుండుట అవసరము. నిన్ను సభా ప్రారంభమునుండి చూచుచున్నాను. మహాకవియైన ధూర్జటిని నీ నిశితమైన హాస్యముతో పరిహాసము చేయుచున్నావు. ఆ మహాకవి హృదయాన్ని గాయపరుస్తున్నావు. హాస్యం రసమయంగా ఉండాలి కానీ, విషదిగ్ధంగా ఉండ కూడదు నాయనా! అన్ని వేళలా అలా అంటున్నావని కాదు. ప్రత్యేకంగా ధూర్జటి విషయంలో నీ మాటలు తీయని హాస్యం కోసం ప్రయత్నిస్తున్నా కటుమయంగా ఉంటున్నాయ్. గమనించుకో.

ధూ : పెద్దన కవీంద్రా! మీ మనస్సు చాలా సున్నితమైనది. ప్రభూ!.... మహామంత్రీ!....సభికులారా!...మీరంతా వినండి. ఈ యథార్థాన్ని తెలిసికోండి. అనుదినము విజయనగర రాజ వీధులలో అర్ధరాత్రి వేళ ఆ వేశ్య వాకిటి ముందూ ఈ వేశ్య వాకిటి ముందూ కనిపిస్తున్న నన్ను చూచిన రామకృష్ణుని హృదయంలో అగ్ని రగుల్కొన్నది. 'మహా కవివైన నీవు ప్రజల కంటిలోబడి చులకన కావద్ద'ని 'అవసరమైతే మీ సౌధానికే ఎవరు కావాలీ అంటే వారినే పంపే ఏర్పాటు చేయిస్తా'నని రామలింగ కవి ఎన్నోసార్లు చెప్పాడు.

దానికి నే నిచ్చిన సమాధానం - 'మా యింట అసలే వీలుకాదు. నా భార్య పరమగయ్యాళి, దుర్మార్గురాలు, విరసురాలు; ఆ పరిసరాలల్లో

నాకు ఏ స్త్రీతో ఉన్నా ఆనందం రా'దని యథార్థం చెప్పాను. అంతే కాకుండా నేను వెళ్ళిన వీధులన్నిటిలోనూ రామలింగ కవి నా కంట పడ టంతో 'ఈ పెద్దమనిషి కూడా యిదే పనిచేస్తూ నాకు నీతులు చెబుతున్నా డ'ని అనుకొన్నాను. అంత నేను

'ఇంటి లోపల భార్యతో నేకపత్ని
వ్రతు డనంగ జెలుంగును రాత్రివేళ
స్వామి పురికాంతలన్ జేరి సరసమాడు
రామకృష్ణుడు సార్థకనాము డవని'

అని అపహాస్యం చేశాను. 'ఊరంతా అనుకుంటున్నారు. నీ గుట్టు రట్టు కాకుండా చూసుకో. ఈ సంగతి నీ భార్యకు తెలిసిందా అంటే నీ సంసారం పుట్టి నడి సముద్రంలో మునుగుతుంది' అని హెచ్చరించాను.

నా హెచ్చరికను రామలింగకవి పట్టించుకొనలేదు. 'మూడో కంటి వాడికి తెలియకుండా చెయ్, ధూర్జటీ!' అన్నాడు రామలింగ కవి. అప్పుడు నేను 'మూడో కంటివాడికి తెలియకపోయినా, మూడు కన్ను లున్న పరమశివునకు తెలుస్తుంది గదా!' అన్నాను.

ఆ తర్వాత కూడా రామలింగ కవి నన్ను వదిలిపెట్టలేదు. అప్పుడు నేను రామలింగ కవి యింటికి వెళ్ళి, స్వయంగా ఆయన భార్యతో చెప్పాను.

'చెల్లెమ్మా! నేను వెళ్ళిన ప్రతిచోటికి మీ ఆయన కూడా వస్తున్నాడు. ఇంత అందమైన, మహాసాధ్వియైన యిల్లాలిని యింట్లో బెట్టుకొని మీ ఆయన కేం పోయే కాలం వచ్చింది' అని అన్నాను.

అప్పుడు ఆమె చెప్పిన సంగతులివి:

'అన్నా! మా దాంపత్యంలో గల అన్యోన్యతను మీ రెంత మాత్రం సంశయించ నక్కరలేదు. మేము ఆనందంగానే ఉన్నాం. ఆయన ప్రతి నిత్యమూ సానివాడలో తిరుగుతారు. ఆ సంగతి నాకు బాగా తెలుసు. సాని వాడలో పెరిగే బాలికలకు సాహిత్యము, సంగీతము, నాట్యము చెప్పటం ఆయన చేస్తున్న పని. అవి వాండ్ల భవిష్యజ్జీవితానికి, ఉపాధికి

అక్కర కొస్తాయని ఆయన విశ్వాసం. వారిలో కొంతమంది ఆ విధంగా తయారై, వాండ్ల దుర్భర వృత్తిని వదిలిపెట్టి, దేవాలయాల్లో నాట్యం చేసేవారిగానూ, రాజుల కొలువుల్లో నాట్యం చేసేవారిగానూ ఉద్యోగాలు సంపాదించుకున్నారు. వారికి ఎన్నో పురాణ గాథలు, భక్తి తత్వాలు చెప్పి, వారి జీవితాని కొక నవ్య చైతన్యాన్ని ప్రసాదించటం కోసం ప్రయత్నిస్తున్నారు. మానవ సేవయే మాధవ సేవ యని వారి యంత రంగ విశ్వాసము.

వారు అప్పుడప్పుడూ హాస్యంగా చెబుతూ ఉంటారు: 'కొందరు వేశ్య మాతలు తన పురాణాన్ని ఈ చెవితో విని ఆ చెవితో వదలి వేస్తున్నారు' అనీ, 'మరి కొందరు వేశ్యలు వారు చెప్పిన సంగీత, సాహిత్య, నాట్య పాఠములతో వారి వృత్తిని ఘనంగా సాగిస్తున్నారు' అనీ, 'కొందరు వారు ప్రబోధించిన శివ భక్తితో ధూర్జటిగారి మనస్సును రంజింప చేస్తున్నారు' అనీ, 'కొందరు ఆయన బోధించిన విష్ణు భక్తితో శ్రీకృష్ణరాయలు వారిపై మక్కువ పెంచుకున్నా'రనీ, 'వారిలో కొందరిని లాలించి, వారి మాటలాలించి, వారినొక దోవన పెడుతున్నాను' అనీ, పరమాత్మయైన కృష్ణభగవానునిపై ధ్యానం పెంచుకొని గోపికలు జీవితాలు గడిపినట్లుగా గడుపవలసినదిగా వారికి ఉద్బోధ చేస్తున్నట్లు, తన ప్రయత్నాలు నెరవేరుతున్నట్లు- ఇలా రకరకాలుగా చెబుతుంటారు. అన్నా! నాకు వారిపై పరిపూర్ణమైన విశ్వాసముంది. వారు పరమపూజ్యులైన వ్యక్తులు. హాస్యమున కేదియో మాటాడుచుందురు. మా జీవిత నావ మహా ప్రశాంతముగా సాగిపోవుచున్నది. కానీ, మిమ్ములను గురించియే అప్పుడప్పుడూ బాధపడుతుంటాము' అని చెప్పింది.

అప్పుడు నాకు తెలిసింది. అంతకుముందు నేను 'పట్టణంలో సాని వాండ్లకు కూడా యింతటి శివభక్తి యేమిటి!' అని అనుకునేవాణ్ణి. కానీ ఆ భక్తితత్వం రామలింగ కవి ప్రబోధితం అని అప్పుడు నేను తెలుసు కున్నాను. అంత నేను 'అమ్మా! యిలా వచ్చానని రామకృష్ణునకు తెలియనీయవద్దు' అని చెప్పి ఆమె సెలవు తీసుకున్నాను.

ఆ ఘటనతో నాకు జ్ఞానోదయమైంది. ఆనాడే ఈశ్వరుని ముందు ప్రమాణం చేశాను: 'హరా! మరెన్నడూ ఏ వేశ్యనూ ముట్టకోను' అని.

అప్పటినుండీ రామలింగకవి చేసే ప్రయత్నంలో నేనూ భాగస్వామి నయ్యాను. కానీ, ఆ వేశ్యలతో చెప్పాను—'నేను వాండ్ల యిండ్లకొచ్చి పాఠాలు చెబుతున్నట్లు, భజనలు ఏర్పాటు చేస్తున్నట్లు రామలింగ కవికి కూడా తెలియనీయవద్ద'ని. ఆనాటినుండీ వాండ్లు రామలింగ కవిని వాండ్ల యిండ్లదరికి కూడా రానీయలేదు అంతటితో ఆ మహా కవి అనుమానం మరీ ఉధృతమై పోయింది. అప్పటినుండీ ఆయనకు నాపై ద్వేషం మరీ హెచ్చిపోయింది.

పెద్దన కవీంద్రా! రామలింగకవి నన్నెన్ని మాటలన్ననూ, నా కతని మీద ఎంతమాత్రమూ కోపంలేదు. అతడు కాళికాదేవి అంశ సంభూతుడు. ఆమె వరప్రసాదలబ్ధుడైన వికటకవి. నాకు అనవరతమూ శివుడు నా అంతరంగంలో నటిస్తున్నట్లే వినిపిస్తుంటుంది. అందువల్ల, నేను మా యిద్దరి మధ్యలో జరిగే వాగ్వివాదాన్ని నాలో నున్న శివునకు, రామలింగకవిలో నున్న కాళీమాతకు జరుగుతున్న రసమయమైన ప్రణయ కలహంలాగా భావిస్తున్నాను. అది నాకెంతో సరదాగా నున్నది. ఎవరైనా భార్యాభర్తలు, ఈ రకంగా ఒకరినొకరు హాస్యమను పరిమళంతో కూడిన పువ్వులను రువ్వుకుంటూ చైతన్యవంతంగా ఉంటే ఎలా చూచి సంతోషిస్తామో, మమ్ములను చూచి కూడా మీరంతా అలాగే ఆనందించండి.

కామ ఉన్మాదంతో నే జీవించిన నా జీవితానికీ, సానివాడల చుట్టూతా ఏ కారణంగా నైతేనేం తిరిగిన నా ప్రవర్తనకూ, నేను సిగ్గు పడుతున్నాను. జీవితాన్ని కేవలం భగవంతుని సేవకు అంకితం చేసి కైవల్యాన్ని కోరుకోకుండా యింతవరకు వృధా చేశాను. ఈనాడే నాకు జ్ఞానోదయమైంది. పరమేశ్వర పాదారవింద సేవకన్నా మిన్నయైనది లేదు....లేదు....లేదు అని తెలిసికొన్నాను. నేనిక సన్యసిస్తాను. ఇది నా తుది నిర్ణయం. (జంధ్యములు తెంపబోవును.)

పె : (జంధ్యములు తెంపుటను ఆపి) ధూర్జటి కవీంద్రా! ఏ పనియైననూ ఆవేశముతో చేయుట మంచిది కాదు. ఆలోచించి చేయవలయును. నీ భార్యా పిల్లల గతి ఏమి చేయుదువు? ఏ గృహస్తునకునూ సన్యసించుట తగిన పనిగాదు నాయనా! సంసార బంధములు లేనివాడు సన్యసించి

లోక కళ్యాణము కోరి చరించవచ్చును. ముక్కు మూసుకొని మోక్షార్థియై తప మాచరించవచ్చును. కానీ గృహస్థు సన్యసించుట అనుచితము. ఇంటి లోపల భార్యా పిల్లల ఆత్మలకు శాంతి, సంతోషము సమకూర్చ లేని సన్యాసి ప్రపంచ మంతటికి ఏమి సంతోషమును సమకూర్చగలడు? గృహస్తుగా ఉండియే తామరాకుమీది నీటిబొట్టువలె ఆత్మ సన్యాసియై జీవింపవచ్చును. నీ విట్టి మాట కలనైననూ తలపెట్టకుము. ఇది పెద్ద వాడనైన నా కోరిక.

ధూ : పెద్దన కవీంద్రా! నాకూ, నా భార్యకూ ఉన్న ఆత్మీయత, అన్యోన్యత లోకమున కంతటికీ విదితముగా జెప్పితిని. నేను సంపాదించినది నా పిల్లల భవిష్యత్తుకు చాలును. జీవితములో వ్రాయ వలయు ననుకొన్న కావ్యములను వ్రాసితిని. నా కింక ఏ పదవులపైననూ, ఏ బహుమాన ములపైననూ కోరిక లేదు. సంసారమును మరచి సన్యసించి సర్వేశ్వరుని స్మరించుటయే నా జీవిత పరమావధి.

తె : వెట్టి కుదిరినది, రోకలి తలకు చుట్టండి అని ధూర్జటికవిలాంటివాడే ఎవరో అడిగాడట. పెద్దన కవీంద్రా!.... కృష్ణరాయ ప్రభూ!.... ప్రజలారా!.... నేను ఇంతవరకునూ ఎవ్వరికినీ చెప్పక నా హృదయములో అగ్నిగోళము వలె దాచుకొనుచున్నాను. ఈనాడు దానిని మీ ముందుంచుచున్నాను. వినండి. ఇది కొన్ని ఏండ్ల క్రిందటి మాట. ధూర్జటి కవీంద్రుని భార్య ఒకనాడు మా యింటికి వచ్చి "అన్నా! ఊరందరూ అనుకొనుచున్నారు. 'అదిగో, ఆ దోవనబోవు సానిది నీ లెక్కలేని అక్కలలో ఒక్కతె. చుక్కలలో చందమామలాగా ఉంది. చూడు' అని పరిహాసమాడు చున్నారు. నా హృదయము బ్రద్దలౌచున్నది" అని ఏడ్చెను.

అప్పుడూ నేను 'అమ్మా! భర్త పెండ్లికి ముందు ఏమి చేసిననూ, పెండ్లియైన తరువాత భర్తను అదుపులో పెట్టుకొనుట భార్య ధర్మం. భర్తను సరసతతో తీర్చి దిద్దుకొనవలసినదీ, భర్త మంచీ చెడూ చూడ వలసినదీ భార్యయే' యని చెప్పి, 'ఆనాటి నుండి కొంత కరుకుగా ప్రవర్తించమ'ని చెప్పితిని. మరియు 'ఊరక పదిమంది వద్ద చెప్పు కొన్ననూ లాభము లేద'ని చెప్పి పంపివైచితిని. ఆనాటినుండీ ఆమె ఏమి చేసినదో! ఆ తర్వాత ఆమె పుట్టింటి వారికి గాని, ఊరిలోని వారికి గాని,

ఒక్కసారియైననూ ఈ విషయమును గురించి చెప్పినట్లు నేను వినలేదు. కాలాంతరేణా వారి సంసార మీతీరు బట్టినది. దీనికి నేను కూడా కొంత వరకు బాధ్యుడనని వగచుచున్నాను.

మా : ప్రభూ! ఈ విషయమున నా యభిప్రాయమును తెలుపనిండు. ధూర్జటి కవిగారి భార్య మా యింట మా అమ్మగారితో మాటాడుటకు వచ్చెడిది. మా అమ్మగారు ఆమెను ఎంతగానో మెచ్చుకొనెడిది. నేను అంతగా ఆమె రాకను పట్టించుకొనలేదు కానీ, ఆమె మా అమ్మగారి నడిగి, నేను వ్రాసిన రాజశేఖర చరిత్రను తీసికొని ఆమూలాగ్రముగా చదివినది. లగ్నం పెట్టింది లగాయితూ గృహప్రవేశం దాకా నేను వర్ణించిన వివాహ ఘట్టమును మా అమ్మగారికి శ్రావ్యముగా చదివి వినిపించి ఎంత గానో మెచ్చుకొన్నది. తనకునూ ధూర్జటి కవికినీ జరిగిన వివాహమును గురించి వర్ణించి వర్ణించి చెప్పి ఆమె హృదయ విదారకముగా ఏడ్చుటను నేను వింటిని.

మా యింట ఆమెకు మరియొక కావ్యము దొరికెను. అదియూ నేను వ్రాసినదే. దానిలో ఒక విద్యార్థి గురువుగారి యింటనుండి వారు పెట్టిన అన్నముదిని చదువుకొనుచుండెను. ఆ గురువున కా శిష్యుడన్న నెన లేని వాత్సల్యము. ఆ గురువు గారి కూతురు ఆ విద్యార్థిని ప్రేమించెను. ఆ గురువు భార్యకు బీదవాడైన ఆ విద్యార్థికి పిల్లనిచ్చుట కిష్టములేదు. ఆమె - 'నీలాంటి బీదవాడికి నా కూతురి నిచ్చుట జరుగదు. నీవు మహా ధనవంతుడవైన, ఆనాడు ఆలోచించ వచ్చును' అనెను.

అంత నా విద్యార్థి ఆ గురువుగారి ఆశీస్సులను పొంది ఆ ఊరు వీడి, రసవత్తరమైన యొక కావ్యమును వ్రాసి, ఒక మహారాజు కొలువున ఉద్యోగము సంపాదించి, గురువుగారి గృహమునకు మరలి వచ్చెను. అప్పటికే గురువుగారి కూతురికి పెండ్లి యయ్యెను. ఈ కావ్యమును ఆసాంతమునూ చదివి, మా అమ్మగారికి వినిపించి, చిట్టచివర విషా దాంత ఘట్టమున ఆమె ఎంతయో వేదనను పొందెను. ఆమె దుఃఖము పైకి పొరలక కనులలో నిలిచిపోయి గుండె బ్రద్దలగునా యని యని పించెను. ఆమె హృదయము నెట్టులో చిక్కబట్టుకొని 'ఇందుకేనా మల్లన కవిగారు వివాహము చేసికొననిది?' అని మా యమ్మగారిని

ప్రశ్నించెను. దానికి మా అమ్మగారు 'గృహస్థుగా ప్రతివాడూ జీవించును. దేశ సేవ స్వ సుఖమునకన్నా మిన్నయని వాడి యభిప్రాయము. అట్టి యుద్దేశ్యము కలవాడగుట చేతనే, శ్రీ కృష్ణదేవరాయలవారు ఎచ్చట యుద్ధమున కేగిననూ వాడచ్చటికే ఏగుచుండు'నని జవాబు చెప్పెను. ఇది విన్న ఆమె ఆనందబాష్పములను రాల్చెను.

ఆమె కరుణామయి. మహా సౌజన్యమూర్తి. ఆమె సౌందర్యవతి యని నేను చెప్పజాలను కానీ, ఆమె హృదయ సౌందర్యము మహత్తర మైనదని నేను నొక్కి వక్కాణింపగలను. ఆమె, గుండె వేదన చేత కరుడు గట్టి, ఇంట గయ్యాళి వలె, విరసురాలి వలె, దుర్మార్గురాలి వలె ప్రవర్తించి యుండును. ఈ విషయమున తప్పు ధూర్జటిది. ఆమె హృదయ సౌందర్యమును గమనింపక, తన ప్రవర్తనను తాను సరిదిద్దు కొననేరక, పై పై మెరుగులు గలిగి పయ్యెదలు జార్చుగల సాని కొంపలకు పరుగెత్తిన ధూర్జటి దండనార్హుడు ప్రభూ, దండనార్హుడు! రాయలవారు ఈ కవికి ఏ శిక్ష విధించిననూ తప్పులేదు.

తె : ధూర్జటి కవీంద్రా! మీ పెండ్లినాడు విఘ్నేశ్వర పూజను బ్రాహ్మణుడు సరిగా చేయించినట్లు లేదు. ఈనాడైననూ విఘ్నేశ్వరుని వంటి మల్లన కవీంద్రులకు నమస్కరింపుము.

పె : రామలింగ కవీ!....నీ పరిహాసము లాపుము. మహారాజా! మీ యనుజ్ఞను తీసికొనకుండా సాని కొంపలలో వారి పిల్లలకు చదువు చెప్పుచున్న రామకృష్ణ కవియూ దండనార్హుడే.

ధూ : మా యిరువురకును ప్రభువుల వారు ఒకే శిక్ష విధించిన ఆనందముగా జీవింతుము.

తె : అబ్బ, ఎంతటి ఆశ? మహారాజా! నే నెందుల కట్టుల బోగము వారి యిండ్లలో వారికి సంగీత, సాహిత్య నృత్యములు నేర్పితినో మీకునూ ఈ సభకునూ విన్నవించనిండు. దండనార్హుడనైన నేనునూ తమరు విధించు దండనను తప్పక శిరసా వహింతును.

ఇది కొన్ని ఏండ్ల క్రిందటి సంగతి. అవి నేను క్రొత్తగా విజయ నగరమునకు వచ్చిన రోజులు. ఒకనాడు హజార రామస్వామి దేవాలయ

మునకు వెళ్ళితిని. అచ్చట వరలక్ష్మీదేవి యనునొక ప్రౌఢ వేశ్యను చూచితిని.

పె : రామలింగ కవి ఏవియో అర్థము లేని యుపాఖ్యానములను కల్పించి చెప్పుచున్నాడు. ప్రభూ! ఇది యంతయు అతడు చేసిన తప్పులను కప్పి పుచ్చుకొన చూచెడు ప్రయత్నము.

తి : రామలింగ కవిని చెప్పనీయండి పెద్దన కవీంద్రా! విషయము వివరముగా తెలిసిననే గాని ధర్మ నిర్ణయము జరుగుటకు వీలులేదు.

తె : వరలక్ష్మీదేవి యను వేశ్య పెద్దన కవిగారికి బాగా తెలుసు ప్రభూ!

పె : నాకామె ఎంత మాత్రమును తెలియదు ప్రభూ!

తె : తెలుసు, మీ కామెతో పరిచయమున్నది.

పె : తెలియదు, తెలియదు తెలియదు- ముమ్మాటికిని తెలియదు.

తె : ఆమెను మీరు బాగుగా ఎరుగుదురు. ఆమెతో మీకున్న అనుబంధము నాకు బాగా తెలుసు.

(పెద్దన మళ్ళీ మాటాడబోవును.)

తి : పెద్దన కవీంద్రా! రామలింగ కవిని చెప్పనీయండి.

పె : ప్రభూ! ఈ విషయమునకు, ఈ నాటి మన సాహిత్య గోష్ఠికి ఎంత మాత్రమూ సంబంధము లేదు.

తె : ఈ నాటి మన అవధాన ప్రక్రియలో నిది రసమయ ప్రసంగము అను నంశము క్రిందికి వచ్చును.

పె : మహారాజా! ఇది కేవలము అసందర్భ ప్రసంగము.

కృ : కవితా పితామహా! రామలింగ కవిని చెప్పనిండు.

తె : హాజర రామస్వామి ఆలయములో, ఆ వరలక్ష్మీదేవి యను వేశ్య, పెద్దన గారి పాదముల గుర్తులున్న అన్నిచోట్ల, వంగి వంగి నమస్కరించు చుండెను. ఆమె కేమైన పిచ్చియా అని కొంచెము సేపు సంశయించి చూచితిని. ఆమె కట్టూ, బొట్టు, సౌందర్యమునూ చూచిన నాకు ఆమె యొక యున్మాదిని వలె నెంత మాత్రమూ కన్పించలేదు.

అంత నేను 'ఏమమ్మా! ఎందులకట్టుల నమస్కరించుచున్నావు? ఆయన ఎవరు?' అని ప్రశ్నించితిని. ఆమె యొక నవ్వు నవ్వి 'ఆంధ్ర కవితా పితామహుని, అల్లసాని పెద్దన కవీంద్రుని ఎరుగని వారు ఈ దేశమున లేరు. నీవెచ్చటి నుండి వచ్చితివి?' అని యడిగెను. 'మాది గుంటూరు మండలము. నేను క్రొత్తగా వచ్చితిని' అని సమాధానము చెప్పితిని. మరల నేను 'ఆయనకెందుల కంత భక్తితో మ్రొక్కుచున్నారు'? అని యడిగితిని. అప్పుడామె 'ఆ మహానుభావుడు నా ఆరాధ్యదైవము. ఆయన వలననే నేను మహోన్నతమైన జీవితమును గడుపుచున్నా'నని సమాధానమిచ్చెను.

పె : రామలింగ కవి కల్పనలు హద్దుమీరుచున్నవి.

కృ : చెప్పనీయండి పెద్దన కవీంద్రా! మీరు అడ్డు రావలదు.

తె : పెద్దనగారేమనుకొన్ననూ, సహృదయులైన మీవంటి మహారాజుల కీ విషయమును చెప్పుట నా ధర్మము. నేను కాలక్రమేణా పెద్దనగారి యింటిలో పాగా వేసితిని. వారి సతీమణికి నేనన్న ఎనలేని వాత్సల్య మేర్పడెను. నెమ్మదిగా నామెతో మాటల సందర్భమున ప్రశ్నించితిని: 'అమ్మా! మన విజయనగరమున వరలక్ష్మిదేవి యను నొక వేశ్య యున్నది. ఆమె కట్టూ బొట్టూ అంతయూ మీవలెనే యుండును. మిమ్ములను చూచిన నేరకముగా నమస్కరింపవలయునను ఉద్దేశ్యము కలుగునో, ఆమెను చూచిననూ అటులే యనిపించును. నా కర్థముగాని దొక్క విషయము. ఆమె యొకనాడు హజార రామస్వామి ఆలయములో పెద్దనకవిగారి యడుగుల గుర్తులకు నమస్కరించుచుండగా చూచితిని. ఆమెకు పెద్దన కవీంద్రులన్న నెనలేని గౌరవము. వేశ్యయయ్యునూ ఆమె యెందులకట్టుల నమస్కరించునో మీకేమైన తెలియునా?' యని యడిగితిని.

అంత పెద్దన గారి భార్య మునిముని నవ్వులు నవ్వుచూ నిట్లు చెప్పెను:

'అవి మా పెండ్లియయిన క్రొత్తరోజులు. అప్పటి రోజులలో మా వారు మహా సౌందర్యమూర్తులు. ఆ వేశ్య పదహారేండ్ల కన్నె

పడుచు. ఆమె పేరు వరాలు. ఆమె జగదేక మోహన సౌందర్యమూర్తి. చక్కగా సంగీతము పాడగలదు. వీణ వాయించగలదు. అద్భుతముగా నాట్యము చేయగలదు. ఆమె మనసారా మావారిని ప్రేమించెను. మావారు రామస్వామి ఆలయమునకు వెళ్ళిన ప్రతిసారీ ఎంతో మక్కువగా చూచెడిది. ఆ ఆలయ మండపమున, సంగీతము పాడుచూ, నృత్యము చేయుచూ, ఆమె కనిపించెడిది. ఒకనాడు మావారు, ఆలయ మండపములో వీణ వాయించుచున్న, ఆమెను నాకు కూడా చూపించెను. ఆ వరాలు ఎన్నియో మారులు మావారిని 'విప్రవరా! విప్రవరా! మీతో జీవితాంతమూ ఆనందింపవలయునని నా కోరిక' అని తన ప్రేమను వెల్లడించెనట. మా వారు 'హరి హరీ! నీవు వేశ్యవు. నేను వివాహితుడను. నిత్యాగ్ని హోత్రపరుడనైన బ్రాహ్మణుడను. నీకూ నాకూ సంబంధము పొసగదు' అని చెప్పిరట.

కానీ, ఒకనాడు-అది కార్తిక సోమవారము. మావారు, పట్టణమునకు దూరముగా నున్న శివాలయమున, నభిషేక మొనరించుకొను చుండిరి. ఆ వన్నెలాడి శివుని యాలయములో ప్రవేశించెను. ఆ ఆలయపు తలుపుల నెవరో మూసిరి. కనులు మూసుకొని ఈశ్వరున కభిషేకము గావించుకొనుచున్న నా భర్త దానిని నంతయూ గమనింపలేదు. ఆమె వంటి మీద సుగంధము గుబాళించినంతనే మా వారు కన్నులు తెరచి చూచిరి. ఆ జగన్మోహన సౌందర్యరాశి ఆయన కన్నులకు కన్పట్టెనట. అప్పు డాయన ఆలయపు తలుపులు వేసియుండుటను చూచెనట. అంత మా వారు 'ఒంటరిగా నున్న సమయమున నా కొరకిట్టుల వచ్చుట తగని పని. ఇది పరమేశ్వరుని ఆలయము. బయటికి నడువుము' అని కసరు కొనెను. అంత నా వరాలు' స్వామీ! దైవ దర్శనమునకు నేను లోపలకు వచ్చితిని. తలుపుల నెవరో మూసిరి. ఇది యంతయూ దైవేచ్ఛతో జరుగుచున్నది. మీ కౌగిలియే నాకు శరణ్యము' అని మా వారిని కట్టుకొన్నదట. మరియు 'ఈ ఆలయమున మన మిద్దరమూ ఏకాంతమున నుంటిమి. మీరు నన్నేమి చేసిననూ, చేయకున్ననూ, ఆ తలుపులు మూసిన వారు మనలను చూచియే యుందురు. తప్పకుండా లోకమున కీ సంగతిని చెప్పనే చెప్పుదురు. పోవు పరువెట్టులైననూ పోవును.

నా తలపులు మిమ్ములనే పెనవేసికొన్నవి. నన్ను మీతో కలిసి ఆనందమును పొందనీయుడు. ఇది భగవన్నిర్ణయ'మని వేడుకొనెనట.

అంత నా భర్త 'అయ్యో పరమేశ్వరా! ఈ పడతి నాపై మరులు కొన్నది. అనంగ సంగరమునకు నన్ను గవయ చూచుచున్నది. ఆ పన్న చరితా! సర్వేశ్వరా! నన్ను రక్షింపు'మని ప్రార్థించెనట.

అంత నా వరాలు మోహము తలకెక్క మావారి దేహమును ఆక్రమించి.... రామలింగా!.... సిగ్గగుచున్నది, ఏమి చెప్పను?.... మావారి ఎదపైననూ, బుగ్గలపైననూ ముద్దుపెట్టుకొనెనట ఉచ్ఛ్వాస నిశ్వాసములతో నామె ఎడద కాలిపోవుచుండ, పరసతి స్పర్శతో మావారి శరీరము భగ్గున నగ్గి తాకినట్లయ్యెనట. అంత మావారు ఆ తొయ్యలిని త్రోసివైచిరట. అప్పుడామె నేలపై కూలబడి 'నీవు త్రోసివేసితివి. నా హృదయమున నైన గాయమును చూడుము' అని చూపించెనట. అంత మావారు కన్నులు మూసుకొని 'నేను బ్రాహ్మణవంశ సంజాతుడనేని, నిత్యాగ్నిహోత్రపరుడనేని, అగ్నిదేవుడు కనికరించి, ఈ విపత్సముద్రము నుండి నన్ను రక్షించుగాత!' అని పలికెనట. అంత ఎచ్చటికో వెళ్ళిన పూజారి తిరిగివచ్చి గర్భగుడి తలుపులు తెరిచెనట. అప్పుడు మావారు మారుమాటాడక చెంబును ఉద్ధరిణెయు తీసికొని పలాయన మంత్రమును పఠించిరట.

అప్పుడా గుడిలో ఆ పూజారి వరాలను చెరచ ప్రయత్నించెనట. అంత నామె 'నేను పెద్దన కవిని ప్రేమించితిని. ఆయననే భర్తగా నారాధించుచున్నాను' అని ఎంత చెప్పిననూ వినక 'నీ వేషము నాకు తెలియునులే. నీవు భోగముదానవు' అని ఆ పూజారి ఆమెపై బడి చెరిచెనట. అప్పుడామెకతడు నా భర్తవలెనే గోచరించెనట. ఈ విషయము నంతయూ ఒకనాడు ఆలయమున కేగిన నా భర్తతో చెప్పి, ఆ వరాలు బోరున విలపించెనట.

అంత నా భర్త 'వివాహితుడయిన ఏ పురుషునీ ఏ స్త్రీయూ ఎన్నడూ కోరరాదు. అది ధర్మ విరుద్ధము. కర్మ ఎవరికిని అనుభవింపక తప్ప'దని పల్కెనట. ఆ తర్వాత నామె ఈ పట్టణమును వదలి పుణ్య

క్షేత్ర సందర్శనమున కరిగెనట. తిరిగి తిరిగి కొంతకాలము క్రితము మరలి వచ్చినది. ఇదీ ఆమె వృత్తాంతము. ఆమె జీవితములో నింత గందరగోళము జరిగినది. మావారు వెంటనే యింటికి పరువెత్తక, ధీర చిత్తముతో, ఆ అబలను వారి యింటికి చేర్చి వచ్చిన బాగుండెడిది" అని పెద్దన గారి భార్య చెప్పినది ప్రభూ!

ఏలినవారు ఇప్పుడు చిత్తగించండి. ఆ సన్నివేశమున పెద్దన గారున్న శివాలయమే హిమవత్పర్వతము. ఆ వరాలే వరూధిని. ఆ విప్ర వరుడే ప్రవరుడు. ఆ పూజారియే కుహనా ప్రవరుడు. జీవితములో జరిగిన ఘట్టమును రసవత్తరమైన కావ్యముగా వ్రాసి గండ పెండేరమందుకున్న ఘనులు పెద్దన కవీంద్రులు. వారికి నిజముగా ధీర చిత్తమే యున్న, గోచీ సవరించుకొని పరుగెత్తి పోకుండా, పాపము - నేలపై బడియున్న ఆ వరాలను వారింటికి చేర్చియుండెడివారు. కావ్యాన్ని వ్రాసి కవిని అని విఱ్ఱ వీగటమే తప్ప, తన జీవిత సర్వస్వాన్ని ఆయనకోసంగా ఆలోచించి వచ్చి తపించి కోల్పోయిన ఆ అభాగ్యురాలి జీవితం ఏమైందో అని ఒక క్షణం పెద్దనగారు ఆలోచించారా? కవి కరుణామయుడే!.... లోక కళ్యాణాన్ని కాంక్షిస్తాడే! ...పెద్దన కవీంద్రులు ఏం చేశారు?....తన పెద్దరికాన్ని నిలవబెట్టుకోటానికి ఎదుటివాండ్లు ఏమైపోయినా, సమూలంగా నాశన మైనా, స్థాణువులాగా నిలుచున్న జడుడు. స్పందన లేని మనిషి కవి ఎలా అయినాడో అర్థం కావటంలేదు ప్రభూ!

ఆమె సంగతి తెలిసిన నేను ఆమె ఏనాడూ దుఃఖపడకుండా ఆ తల్లికి అండగా నిలిచాను. ఆమెకు కొడుకులు లేని లోటు తీర్చాను. ఆమె స్థాపించిన నటరాజ కళా మందిరంలో నా వంతు పని సాహిత్యము, సంగీతము చెప్పటం, నృత్య నాటకాలను రచించటం ఆమె నాట్యం నేర్పుతుంది. సంగీతం నేర్పుతుంది. ఆమె చిత్రలేఖనం చేస్తుంది. ఆమె యింట్లో నిలువెత్తు చతుర్ముఖుని విగ్రహముంది. ఆ నాలుగు ముఖాలూ పెద్దన కవీంద్రుని పోలియుంటాయి. ఆమె భారత, భాగవత రామాయణాది గ్రంథములలోని సందర్భములను తీసికొని చిత్రించిన చిత్రములు మహా కవుల శ్లోకములను, పద్యములనూ తలదన్నుచున్నవి. మన సంస్కృతిపై ఆమెకున్న యభిమానమూ, పెద్దన కవీంద్రులపై ఆమె కున్న ప్రేమ, గౌరవము, భక్తి నన్ను ముగ్ధుణి చేశాయి ప్రభూ!

అందువల్ల, ఆమె నడిపే వేశ్యోద్ధరణ ఉద్యమంలో నేను కూడా భాగస్వామినైనాను. ఏ స్త్రీ వేశ్య జాతిలో పుట్టినా ఆమె కాముకుల చేతులలో నాశనము కాకుండా కళా తపస్వినియై ఆమె జీవితం భగవత్కైంకర్యానికి అంకితము కావటమో, లేక సరియైన వరుడు దొరికితే ఆదర్శవంతంగా వివాహము చేసుకోటమో జరగాలని ఆ వరలక్ష్మీదేవి గారి కోరిక. ఆమె చేసిన పెండ్లిండ్లు ఇన్నీ అన్నీ కాదు. ఆ సంఘ సంస్కర్తతో చేయి కలిపి సేవ చేస్తున్న నన్ను తప్పు పట్టటానికి పెద్దన గారికి ఈ అధికారం ఎవరిచ్చారు? నా అంతరాత్మ ప్రకారం నేను దండనార్హుణ్ణి కాను ప్రభూ, దండానార్హుణ్ణి కాను! ఆ దండనకు పెద్దన కవీంద్రులే తగినవారు.

పె : నా హృదయము దుఃఖముతోనూ, ఆనందముతోనూ నిండిపోయింది. నాయనా! నీవు చేయు పని యిదియని తెలియక మాటాడిన నన్ను మన్నింపుము ప్రభూ!.... వినండి. రామలింగ కవి చెప్పినదంతయూ యథార్థమే. మొదట రామలింగ కవి వరలక్ష్మీదేవియని చెప్పటంవలన ఆమె ఎవరో నాకర్థం కాలేదు ప్రభూ! అందువల్ల నాకు తెలేదని చెప్పాను. వరాలు అని చెప్పిన వెంటనే గతం నా కన్నుల ముందు నిలచింది ప్రభూ! నేను ఆమెను ఆ పరస్థితిలో ఆమె యింటి వరకూ చేర్చకుండా పరువెత్తి పోవటం నా నేరమే! దానికి మీరు నాకు ఏ శిక్ష విధించినా తప్పులేదు. నేను దండనార్హుడనే ప్రభూ! కానీ, ఆ నాటినుండీ ఈ నాటి వరకూ నా హృదయంలో దాచుకున్న అగ్ని గోళాన్ని రామలింగ కవి కొంత మీ ముందుంచాడు. మిగిలిన దాన్ని నేను మీముందుంచుతాను. దయచేసి వినండి. ఆ శివాలయం నుండి యింటికి వెళ్ళేంత వరకూ నాకు ఏమీ అనిపించలేదు. ఏదో మహత్తరమైన ప్రమాదంనుండి బయట బడినవానివలె యింటికి పరువెత్తాను.

నా భార్య వణికిపోవుచున్న నన్ను చూచి దగ్గరకు వచ్చింది. ఆమెను గాఢముగా నా హృదయమునకు హత్తుకొంటిని. అంత హృదయవేదన, ఆనందమూ ముప్పిరిగొనగా, ఆమె శీర్షముపై నా కన్నులనుండి బాష్ప

ములు జలజలా రాలినవి. ప్రభూ! అప్పుడు నా భార్య 'జరిగినదేమి?' అని ప్రశ్నింప, జరిగినదానినంతయూ చెప్పితిని అప్పుడు నేను నా భార్యతో నన్న మాటలు వినండి ప్రభూ!

'అంతటి సౌందర్యరాశి బాహువులలో బందీనై యుంటిని. ఈశ్వ రాలయపు తలుపుల నెవరో మూసి యుండిరి. నేను ఏ వంక కేగిననూ ఆమె పసిపిల్లవలె,అనంగుని బాణమువలె,త్రాచుపామువలె నన్ను పెనవేసు కొన ననేక విధముల ప్రయత్నించు చుండెను. ఆ విశాలమైన కనులలో వెలుగు దివ్యదీధితులు, ఆమె మేని బంగారు రంగు జిగి, ఆమె ముఖ మండలమున విరిసిన నవ్వుల వెన్నెలలు, నా కనులకు చీకట్లు గొలిపినవి. దీనినంతయూ నా పరమేశ్వరుడు, కందర్ప దర్ప హరుడు చూచు చుండెను. నా ధృతి సన్నగిల్లునేమోయని, నా మనస్సునకు గూడా ఒక్క క్షణ మనిపించుచుండెను. అయిననూ, నేను ఏకపత్నీ వ్రతుడను; నా జీవితము మహోన్నత సౌందర్యరాశి, అవ్యాజ కరుణామయ మూర్తి, పరమ పతివ్రతా శిరోమణి అయిన నా భార్యకే అంకితమని తలంచుచూ, 'యద్యదాచరతి శ్రేష్ఠః తథైవ యితరే జనాః' - పెద్దలు ఏమి ఆచ రింతురో, ఇతరులు కూడా అదే చేయుదురు అను ఆర్ష వాక్యమును జ్ఞప్తిలో నుంచుకొని, 'నేను పెద్దనను, లోకమున కాదర్శముగా నుండ వలసిన కవీశ్వరుడను'అని యనుకొని, 'ఆమె మోహ బంధములను నిప్పు వంటి నా ఆత్మ స్థైర్యముతో భస్మీపటలము గావించి వచ్చితిని' అని వల్కితిని.

అంత నా భార్య ఆప్యాయతతో నా వెన్ను నిమిరి 'నిజముగా నే నదృష్టవంతురాలను. కానీ ఆ అమాయకురాలిని, ఆ ముగ్ధమోహన సుకుమార సౌందర్య రాశిని, ఆ పరిస్థితిలోనున్న ఆమెను వారి యింటికి చేర్చి యుండవలసినది. అది మీ ధర్మము' అని యనెను.

అది నా హృదయమునకు కత్తివలె గ్రుచ్చుకొనెను. అప్పుడు నేను 'మొలబంటి కామమను బురదలో నున్న ఆ భామను ఇంటికి చేర్చుట నావల్ల నగు పనిగాదు. ఆ బురదలో నేను కూడా కూరుకొని పోవు పిచ్చి బ్రాహ్మణుడను కాను పులి, పసిడి కంకణము కథ జ్ఞప్తికి

లేని అమాయకుడను కాను. ఆమెను పరమేశ్వరుడే రక్షింపవలయును. పరిహాసము లాడకుము' అని పల్కితిని.

ఆ తరువాత, మరుసటి సోమవారము, శివాలయమునకు అభిషేక మొనరించుకొనుటకు వెళ్ళినప్పుడు ఆమె ఆ పూజారి చేసిన యత్యాచారము నంతయూ చెప్పి, నా పాదములపై బడి కన్నీరు మున్నీరుగా నేడ్చెను. అప్పుడు నేను గుండె చిక్కబట్టుకొని 'వివాహితుడను, ధర్మవిరతుడను అయిన నన్ను కోరుట అనుచితము. కామము నీ తలకెక్కి, భగవంతుని ఆలయములో నిది చేయవచ్చునా చేయకూడదా అను యుక్తాయుక్త విచక్షణ జ్ఞానమును కోల్పోయి నీవట్లు ప్రవర్తించుటచే నీ గతి యిట్టు లయినది. కర్మ ఎవరికినీ తప్పరానిది. ఆ పరమేశ్వరుడు సదాశివుడే నీకు శాంతి ప్రసాదించు గాత!' యని పల్కితిని.

మమ్ములను నిర్వురినీ ఒకచోట చూచిన ఆ గుడి పూజారి ముఖమున కత్తివేటుకు కూడా నెత్తురుచుక్క లేనట్లయ్యెను. ఆమె తల వంచుకుని అచ్చోటు వీడి వెడలెను. ఆ తరువాత 'ఆమె ఆలయములో ప్రవేశించిన తరువాత తలుపులు వేసినది నీవేనా?' అని పూజారిని ప్రశ్నించితిని. అతడు పండ్లిగిలించుచూ 'నేనే' అని సమాధాన మిచ్చెను. అంత నేనా పూజారిని 'నీవు బ్రాహ్మణుడవు. ఏ జాతివాడూ చేయరాని పని చేసితివి. ఆమె యుసురు నిన్ను కట్టి కుడపక మానదు' అని నిందించితిని. అప్పుడా పూజారి 'ఆమె వేశ్యయే గదా' అని పల్కెను. ఆ సమాధానమునకు వళ్ళుమండిన నేను 'పశువు కంటెను హీనముగా నే శరీరముతో నా రకముగా ప్రవర్తించితివో దానికి ఫలితముగా నీ లోకము లోనే నరకమును అనుభవింతువు' అని పలికి, ఆ దేవాలయ ప్రాంగణ మును వదలి పెట్టితిని.

ఆ తరువాత కొలది దినములలోనే ఆ వరాలు, వారి వృత్తిలోనికి దిగుటకు బలాత్కారము చేయుచున్న తల్లితో తగువులాడి, తీర్థయాత్రల కరిగెను. కొలది కాలములోనే ఆ పూజారికి కుష్ఠరోగము సంక్రమించెను. దానితో ఆ గుడి ధర్మకర్తలు వానిని పూజారి పనినుండి తొలగించిరి. అంతనాతడు మహత్తరమైన దరిద్రము ననుభవించి కొంతకాలము క్రితము పక్షవాతముతో మరణించెను.

ఆ వరాల కట్లు జరిగిన అనాటినుండియూ యీనాటివరకునూ, ప్రతి సోమవారమూ శివునకు మహన్యాసపూర్వక ఏకదశ రుద్రాభిషేక మును చేయుచునేయున్నాను. నిత్యము యాచకులకు దానముల నిచ్చు చునే యున్నాను. అవి కేవలము ఆ వరాలు ఎచ్చటనున్ననూ, ఆమె క్షేమముగా నుండవలయునను కోరికతోనే చేయుచున్నాను. ఆమెకు జరి గిన యన్యాయము మరెవ్వరికీ జరుగరాదని విశ్వేశ్వరుని ప్రార్థించు చున్నాను. ఆమె ఈ ఊరు వదిలిపెట్టిన నాటినుండియూ నా మనస్సు ఎంతో బాధకు లోనైనది. నా భార్య వీణ వాయించుచుండిన సమయమున ఆమె నాకు వరాలువలె గోచరించెడిది.

'ఆమెకు నే నన్యాయమొనర్చితినా? ఆమెకానాడు జరిగిన అప కారమునకు నేను బాధ్యుడనా?' అని నాలో నేను ప్రశ్నించుకొనని రోజు లేదు. 'భగవంతుడు నా కెందుల కీ సౌందర్యమీయవలె? ఇచ్చెనుపో, అమ్మహా సౌందర్యవతియైన వరాల దృష్టి నాపైన నేల పడవలె? పడెనుపో! నేను వివాహితుడనని చెప్పిననూ వినక నన్ను శివాలయములో నెందుకు గవయ ప్రయత్నింపవలె? ప్రయత్నించెనుపో! ఆ ఆలయపు తలుపులను ఆ పూజారి ఎందుకు మూయవలె? మూసెనుపో! మరల నెందుకు తెరువవలె? తెరిచెపో! నేనెందుకు పరువెత్తి పోవలె? నే పరు వెత్తితిని పో! ఆ దుర్మార్గుడు 'బ్రాహ్మణుడను- పూజారిని' అని చింతించక అట్టి యత్యాచారమునకు ఏల పాల్పడవలె? అట్టి సన్నివేశమున శంకరుడు త్రిశూలపాణి స్థాణువువలె నెందుకు చూచుచూ నూరకుండవలెను?' ఈ విధముగా నాలోచించుచూ నాలో నేను కుమిలిపోని రోజు లేదు.

'అయిననూ నేను ఏకపత్నీ వ్రతుడను. నేను చేసినది ధర్మమే. నా వల్ల తప్పెంత మాత్రమునూ జరుగలేదు' అని యొక్క క్షణ మాలో చించి ధృతి సమకూర్చుకొనెడి వాడను. వేరొక క్షణము నా యాత్మపై నాకు విశ్వాసము లేక, ఆ అబలను ఇంటికి చేర్చక ఆ పాపమునకు నేను కారణభూతుడ నైతినని చింతించెడి వాడను. దాని వలననే కొంతకాలము ఏ గ్రంథమూ వ్రాయ వలయునను కోరిక కలుగక, కావ్యరచనకు 'నిరుప హతి స్థలము, రమణీ ప్రియ దూతిక తెచ్చి యిచ్చు కప్పుర విడెము కావలయున'ని సాకులు చెప్పుచుండెడి వాడను. 'తప్పు నొనర్చితినా?....

లేదా?' యని నా మనస్సులో పొడమ మీమాంసను మరచి పోవుటకు వరూ థినీప్రవరాఖ్యుల చరిత్రమును సమకూర్చి మను చరిత్ర వ్రాసితిని. దానితో నా వరాలకు ఆచంద్రార్క మగు యశః కాయమును కల్పించితిని. అది నా మనస్సునకు ఎంతయో సంతసము గూర్చెను.

కానీ, రాయల వారు నా కాలికి తొడిగిన గండ పెండేరపు మంజీ రము గల్లు మన్నప్పుడు నాకు వరాల కాలియందెల సవ్వడి జ్ఞప్తికి వచ్చు చుండెడిది. ఆమె నా కన్నుల ముందు ప్రత్యక్షమయినట్లుండెడిది. ఆమెకు జరిగిన యన్యాయము నా వెన్ను తట్టెడిది. 'నీవు పిరికి పందవు' అని ఆమె నన్ను తెగడినట్లుండెడిది.

రామలింగ కవీ! ఆమె తిరిగి వచ్చినది నాకెంత మాత్రమూ తెలి యదు. ఆ నాటినుండీ నేను ఏనాడూ పొరపాటుగా కూడా సానిబజారు వైపు వెళ్ళలేదు.

తె : అంతేగాదు పెద్దన కవీంద్రా! తమరు గుఱ్ఱము మీద ఆస్థానమునకు వచ్చు నప్పుడు, కన్నులు పైకెత్తి తీక్షణముగా దూరముగా నున్నవారిని చూచు కొనుచూ, ప్రక్కనున్న ఎవరినీ గమనింపక, శరవేగమున వచ్చుటే చూచితిని గాని, ప్రశాంతముగా త్రోవ కిరువైపుల నున్నవారినీ, జరుగు చున్న వింతలను, విశేషములను గమనించుట నేనెన్నడునూ చూడలేదు. రాయల వారి యాస్థానమున గండ పెండేరమందుకొన్న కవి యని గర్వము అని యనుకొనెడివాడను. మీ యంతర్మథనమును వచించిన తరువాత, మీ కంఠమున దాచుకొన్న హాలాహలమును తెలిసికొంటిని.

పె : ఏది ఏమైననూ, రామలింగ కవీ! నీవు ధన్యుడవు..... నీవు ధన్యుడవు. అందయూ ఆపులేని ఆ మహత్తర స్త్రీమూర్తి నడుపు ఉద్యమ సౌధము నకు నీవు నడిమి స్తంభమువలె నిల్వొనగలిగితివి లోకమేమనుకొన్ననూ లెక్కచేయక, 'ఆ తల్లికి బిడ్డలులేని లోటు తీర్చుచున్నా'నని సగర్వముగా చెప్పుకొనుచున్న నిన్ను చూచిన నాకు చేయెత్తి హృదయ పూర్వకముగా 'శతాయుర్భవ' అని ఆశీర్వదించవలయునని కోరిక గలుగుచున్నది. 'నాయనా! చిరంజీవివై వర్ధిల్లుము' (చేయెత్తి ఆశీర్వదించును.) నాయనా! రామకృష్ణ కవీ! నాకున్నది ఒక్క ఆడపిల్లయే. నేనునూ,

నా భార్యయునూ నిన్ను పుత్రునిగా భావించుకొనువారము. నీవునూ, మా దంపతుల నిర్వురనూ ఎంతయో ఆపేక్షతో చూచువాడవు. నా చివర కోరిక కోరుకొనుచున్నాను. మా మరణానంతరము మా అందరికినీ నీవే తలకొరివి పెట్టుము.

మహాప్రభూ! కృష్ణరాయా! నే చేసినది నేరమే! ఇప్పుడు మీరు నాకు ఏ శిక్ష విధించిననూ అనుభవించుటకు సిద్ధముగా నున్నాను. (చేతులెత్తి నమస్కరించును.)

కృ : ఆవేశపడకుడు పెద్దన కవీంద్రా! మీవంటి మహాకవులకు జ్ఞానులకు ఇట్టి యావేశము తగదు. మీకు నేను దండన విధించుట యిలలో కాదు గదా కలలో గూడా జరుగదు. అనుభవింప వలసిన దండన నంతయూ, మీ సున్నితమైన మనస్సుతో మీరే అనుభవించితిరి. మీకు నేను చెప్పగల వాడను కాను. కర్మశేషము ఎవరికినీ అనుభవింపక తప్పదు. మీరు బ్రహ్మ స్వరూపులు. ఈ రామలింగ కవి కేవలము శ్రీ మహావిష్ణువు అంశ. ఈ ధూర్జటి సర్వేశ్వరాంశ సంభూతుడు. త్రిమూర్తుల వంటి మీ ముప్పురకునూ నేనిచ్చు దండనము వినుడు ఇదియే నేను మీకిచ్చు దండన - మహా కవులైన మీరు ముప్పురూ భువన విజయమున నిత్యము ఒక రసమయమైన కావ్యమును గానీ అందు కొంత భాగమును గానీ ఆశువుగా వచింపుడు.

తి : కవుల కివ్వవలసిన దండనను సముచితముగానే యిచ్చితిరి. ఈ దండన ఉభయతారకముగానూ, లోక కళ్యాణకరముగానూ ఉన్నది.

ఆంధ్ర భోజునకు....జై, ఆంధ్ర భోజునకు... జై ఆంధ్ర భోజునకు జై, కవి వతంసులకు....జై, కవి వతంసులకు....జై, కవి వతంసులకు....జై.

(ప్రజలందరూ జయ జయ ధ్వానములు చేయుదురు.)

తె : మహామంత్రి తిమ్మరుసుకూ

ఫె : జై.

(ఈ విధముగా తెనాలి రామలింగ కవి, పెద్దన కవి, ప్రజలందరూ కలిసి మహామంత్రి తిమ్మరుసుకూ జై అని మూడు మారులు జయ జయ ధ్వానములు చేయుదురు.)

కృ : జడివాన కురిసి వెలసినది. సూరన కవీ! శరదృతువును వర్ణించండి.

పిం : వెలిగెను తారాకాళి వినువీధి పయిన్ గగనాన స్వచ్ఛమై
వెలసెను చంద్రబింబము ద్రవీకృతమై సుధ జాలువారె వె
న్నెల భువి నెల్ల నిండె నవనీతమువోలె రసాబ్ధి తేలి క
ల్వలు నటియించె వేణువులు పాడెను శారదరాత్రులందునన్.

శరత్కాలంలో రాత్రి సమయంలో ఆకాశంలో నక్షత్రాలు వెలిగాయి. స్వచ్ఛమైన చంద్ర బింబము ఉదయించింది. అమృతము కురిసింది. వెన్నెల వెన్నలాగా భూమి మీద నిండిపోయింది. ఆనందంతో కలువలు నటిస్తున్నాయ్. వేణువులు పాడుతున్నాయ్.

తి : శరత్కాల రాత్రిని మహదానందంగా వర్ణించారు. పింగళి కవీంద్రా! ఏ చుట్టు తిరుగుడూ లేకుండా, ఏ శ్లేషలు భేషజాలు లేకుండా స్వభావోక్తితో బ్రహ్మానందంగా వర్ణించారు.

మా : హేమంత రుతువు నావంతు ప్రభూ! వినండి.

వలిపెంపు చీరయై తెలిమంచు వెలయంగ
పూత జలములలో స్నాతయయ్యె
కన నింపుగానున్న ఘన శాద్వలపు పచ్చ
పట్టు చీరెను మేన గట్టుకొనియె
పెరవారి కనులకు వెరపుగొల్పు మిరప
రంగు కంచుకమును రహి ధరించె
పొలుపార నపరంజిబోలు గుమ్మడిపూల
క్రొవ్వన నొప్పుగా గూర్చుకొనియె

పండియున్నట్టి పంటల భారమెసగ
మందగమనము తోడుత నందమలర
చలిచెలియ వెంటరా భువి జలదరింప
వచ్చె హేమంతలక్ష్మి శుభస్కారముగ.

తె : మల్లన కవీంద్రుల కవితలో కనిపించే స్త్రీమూర్తి, ఎన్నడూ నిత్య యవ్వనం తోనే ఉంటుంది ప్రభూ!

పె : అతడు తెలుగు ఇల్లాలిని అత్యంత సౌందర్యముగా వర్ణించిన మహాకవి. అట్టివానిని హేమంత రుతువును వర్ణించ మనిన అయ్యది జగన్మోహన ముగా నట్టులే ఉండును.

కృ : రామభద్ర కవీ! శిశిర ఋతువును వర్ణించండి.

అ : వినండి ప్రభూ!

అన్నము లోక మందు గల యర్థుల కెల్లర కిచ్చి సర్వ సం
పన్నత కోలుపోయి తనవారల మధ్యన నిల్వలేని యా
పన్నగతిన్ సుమావళియు పత్రములున్ ధర రాలిపోవ లో
విన్నదనంబుతో శిశిరవేళలు కాలము పుచ్చె జాలిగన్.

తి : ఉన్నదంతా అడిగిన వారి కిచ్చేసి, ఐశ్వర్యాన్నంతా కోల్పోయి తన వాండ్ల మధ్యలో తలెత్తుకొని తిరుగలేని దీన స్థితిలో నున్న స్త్రీవలె, పువ్వులను ఆకులనూ కోల్పోయిన శిశిర రుతువు జాలిగా కాలము వెళ్ళ బుచ్చిందా! ఆ యుత్ప్రేక్షాలంకారానికి, ఆ కరుణ రసానికి నీకు నీవే సాటి రామభద్ర కవీ! శ్రీరామచంద్రమూర్తి అరణ్యాలకు పంపిన సీతమ్మ జ్ఞాపకానికి వస్తున్నది.

తె : మీకు అయ్యలరాజు రామభద్రకవి సంగతి సరిగ్గా తెలేదు. నే చెబుతా వినండి: ఆయనలో నున్న గొప్పతనము ఇదే. అయన నవ్వుతూనే ఎదుటివాడు ఎన్నిగంటలయినా మతిపొయ్యేటట్లు ఏడ్చేటంతగా చేయ గలడు. ఆయన నవ్వుతూ హాయిగా ఉంటూ, అదే పదికాలాలపాటు సుఖ మయంగా బ్రతకటానికి మార్గమని తెలిసికొని, అంతటితో ఆగక ఎదుటి వాండ్లను కవిత్వంతో ఏడిపించుకొని తింటాడమాత్యా! సుతిమెత్తని మాటలు, గుండెలలో గుచ్చుకొనే భావాలు, కరుణరసం అయ్యలరాజు రామభద్రకవిగారి ఆయుధాలు. కలకాలం ఆయన హాయిగా బ్రతి కుంటాడు. ఆయన కవిత్వం విన్నవాడు త్వరగా అవలి వడ్డుకు చేరు కుంటాడు.

అ : చూడండి మహాప్రభూ! తెనాలి రామలింగకవి నామీద ఎన్నెన్ని నేరాలు ఆరోపిస్తున్నాడో! తమరు నాకునూ ఏదో దండన విధించవలయునని ఆయన కోరికవలె నున్నది.

కృ : మహాకవులైన ధూర్జటి, పెద్దన, రామకృష్ణుల కిచ్చిన దండన అష్ట దిగ్గజముల కందరికీ వర్తించును. అంతియేకాక మీకు ప్రత్యేకముగా నిచ్చు మరియొక దండన — వినండి: ఈనాటి సభలో జరిగిన ఈ యవధాన పరంపరలోని అంశములను, అక్షరమయినా పొల్లు పోకుండా అన్నింటినీ యొక గ్రంథముగా వ్రాసి, సాధ్యమైనంత త్వరలో మన అమాత్యులవారి కందించండి. దానిని వారు మన పుస్తక భాండాగారములో భద్రపరచెదరు.

తి : హాయిగా కూర్చున్న అయ్యలరాజు రామభద్రకవికి అంతటి దండనా ప్రభూ!

అ : జరిగిన గ్రంథమంతయూ చాలా ఉన్నది. దానిని సంక్షిప్తముగా వ్రాయమందురా?

కృ : సంక్షిప్తముగా కాదు, యథాతథముగానే వ్రాయవలయును. ఈ సభలో జరుగనున్న విషయములను కూడా పరిపూర్ణముగా పొందుపరచుడు.

తి : అమ్మో! ఘోరమైన దండన కృష్ణరాయా!

పె : అసందర్భ ప్రసంగమును కొంత సంక్షిప్తము చేయనీయండి ప్రభూ!

కృ : అందు ఏదియూ అనవసర ప్రసంగము కాదు. అవన్నియూ పరమ భాగవతోత్తముల జీవిత గాథలకు సంబంధించిన విషయములే. అయ్యలరాజు రామభద్ర కవీ! అక్షరం వదిలి పెట్టకుండా వ్రాయండి.

తి : కృష్ణరాయా! (సంశయమును నటించును)

కృ : అమాత్యా! మీ కెంత మాత్రము ఖంగారు వలదు. అయ్యలరాజు రామభద్ర కవి ఆదిశేషుని అవతారము. అతనికి వేయి తలలు, వేయి నాల్కలు. అతని మేధాశక్తి అనుపమానము. అతడు అష్టదిగ్గజములు వ్రాసిన అన్ని కావ్యములనూ, ఆముక్తమాల్యదను, ఒక ఏకాదశి నాడు మన అంతఃపురమున నప్పజెప్పెను. నా ముప్పైరు భార్యలూ ఆ

గ్రంథములను ముందు వేసుకొని, ఎక్కడ ఒక్కతప్పు చెప్పునోయని ఆ పగలు, ఆ రాత్రి, అన్ని కావ్యములను వినిరి. వారికి ఒక్క తప్పు కూడా దొరకలేదు. కానీ, ఏకాదశి జాగరణము మాత్రము జరిగినది.

తరువాత నా భార్యలకొక ఆలోచన వచ్చినది. 'ఈ గ్రంథములు మన పుస్తక భాండాగారములో నున్నవి. వాటి నన్నిటినీ ఆయన కంఠస్థము గావించి యుండును. అందువలన అష్టదిగ్గజములు వ్రాసిన కావ్యాలు కాకుండా, మన దేశములోని కవులు కొందరు వ్రాసిన కావ్యముల వ్రాత ప్రతులను తెప్పింతము. వాటినన్నిటినీ ఒకరోజు వినిపించమని కోరుదము. ఆ మరుసటి రోజు గ్రంథములను చూడకుండా ఒప్పచెప్పమని యడుగుదము. అప్పుడు కూడా రామభద్ర కవి చెప్పగలిగిన వారి ప్రజ్ఞకు జోహారు లర్పింతము. లేకున్న అయ్యలరాజు రామభద్రకవి సంగతి చూతము' అని యనుకొనిరి. అప్పుడు వారు చరిగొండ ధర్మన్న కవి వ్రాసిన చిత్రభారతాన్ని, సంకుసాల నరసయ్య కవి వ్రాసిన కవి కర్ణ రసాయనాన్ని, చింతలపూడి ఎల్లన కవి వ్రాసిన రాధామాధమాన్ని, విష్ణు మాయా నాటకాన్ని, పుత్తేటి రామభద్ర కవి వ్రాసిన సకల కథాసారాన్ని సంపాదించిరి. అంత వారు ఒక దశమిరోజు రామభద్ర కవిని పిలిపించి, ఆ అయిదు కావ్యములను ఒకసారి వరుసగా చదివి వినిపించమని కోరిరి. ఆ నాటి కావ్య పఠనా కాలక్షేపము ముగిసిన తరువాత 'రేపు ఏకాదశి, మీరు ఉదయముననే తప్పక రావలయును' అని వారు రామభద్ర కవిని కోరిరి. రామభద్ర కవి ఏకాదశి రోజు ఉదయముననే వచ్చెను. నేను వలదని వారించుచున్నను వినక, నా భార్యలు ముప్వురూ ఆ అయిదు కావ్యములనూ ఒప్పచెప్పమని పట్టుబట్టిరి. అంత రామభద్ర కవి, గ్రంథావతారికల మొదలు ఆశ్వాసాంత గద్యలతో సహా, కావ్యముల నయిదింటినీ ఒప్పచెప్పెను. ఆ కావ్య పఠనమునంతయూ నేను చాటుగా నుండి వినుచుంటిని.

అప్పుడు నేను, అంతఃపుర అంతర్భాగమునుండి వెలుపలికి వచ్చి, రామభద్ర కవిని మహదానందముతో నాలింగన మొనర్చితిని. అట్టిసమయమున నేను 'ఏమయ్యా. రామభద్ర కవీ! నీ కింతటి ధారణాశక్తి ఎటుల కల్గెను?' అని ప్రశ్నించితిని.

అప్పుడు రామభద్ర కవి 'స్వామీ! యిందు విశేషమేమున్నది? అను దినము నేను రామనామ మంత్రోపాసన చేయువాడను. అందువలన కలిగిన ఏకాగ్రతతో, సీ రకముగా చదివిన కావ్యమును చదివినట్లు ఒప్ప చెప్పుట ఒక లెక్కలోనిదికా'దని చెప్పెను. ఆనాటి సంగతి తలచుకొన్న నాకు దేహ మిప్పటికినీ గగుర్పొడుచును అదేమి ధారణాశక్తియో! అది యొక మహదాశ్చర్యకరమైన విశేషము. ఆనాటి నుండియూ నాకు రామభద్రకవి ఆదిశేషుని అవతారముగా దోచును.

తె : వేయి తలలు వేయి నాల్కలు కలిగియుండుట గొప్ప విషయమే! కానీ, ఒక్కటే అనుమానము. ఒక్క తల, ఒక్క నాలుక గల మనిషియే లోపల నొకటిగా బయట నొకటిగా ప్రవర్తించును. ఇంక వేయి తలలు వేయి నాల్కలు కలవాడు ఏమిచేయునో అని అనుమానము.

అ : ప్రభూ! రామకృష్ణ కవికి అనుమానము హెచ్చు.

కృ : ఎవరి సంగతిని ఏ రకముగా కప్పిపుచ్చి గ్రంథ మాసాంతమునూ అమోఘముగా రచింతువో అని అతని భయము. (రామలింగకవివైపు చూచి) రామలింగకవీ! వ్యాసునకు వినాయకుని వంటివాడైన మన మల్లన కవి యున్నాడు గదా! రామభద్రకవి గ్రంథమునంతయూ చెప్పును. మల్లనకవి వ్రాయును. ఇంక మీకెంతమాత్రము సంశయము వలదు. ఈ గ్రంథ మాచంద్రతారార్కముగా మన గ్రంథాలయమున నిలచి పోవును.

ఇక మీరు సాయంకాలం నుండీ చంద్రోదయం వరకూ కనిపించే ప్రకృతియొక్క సుందర దృశ్యాన్ని వర్ణించండి.

తె. : వినండి ప్రభూ!

ఆలంబాయని చేరె నిండ్లకు కులాయాలందు నున్నట్టి యి
ల్లాలిన్ పిల్లల జూడ పక్షి గణముల్ హర్షమ్ముతో నేగె లో
కాలన్ చీకటి మూసివేసె రజనీకాంతుండు వెల్గొందె నం
దాలన్ చిందెడు కల్వ కన్నెలు మహోత్సాహంబుతో నాదగన్.

ఆవులు అంబా యని అరుస్తూ ఇండ్లకు చేరాయి. పెండ్లాముపిల్ల లను చూడటానికి మగపక్షులు గూళ్ళకు చేరాయి. చీకటి లోకాలను కప్పి వేసింది. చంద్రోదయ మయింది. కలువలు ఆనందంతో ఆడుతున్నాయ్.

తి : చక్కని దృశ్యాన్ని చిత్రీకరించారు.

కృ : ఇక తదుపరి అవధాన అంశాలు - ఆశుకవిత, పురాణము. అప్పాజీ! ఆశు కవితకు, పురాణమునకు విషయమిచ్చుట నా వంతు. మహా కవులారా!

తేట తెల్లంబుగా తెన్గు మాట లమర
సుధ స్రవింపగ భావముల్ చూచువారి
కట్టెదుట శిల్పముల వలె గానుపింప
కథల బల్కుడీ విశ్వవిఖ్యాతి గాంచ.

పెద్దన కవీంద్రా! భట్టుమూర్తి మహాకవీ! అహల్యా వృత్తాంతాన్ని ఆశువుగా పురాణంగా చెప్పండి.

భ : ప్రారంభించండి పెద్దన కవీంద్రా!

పె : వినండి కృష్ణరాయా!

శిల్పి యులితోడ చెక్కిన శిల్పమనగ
నిలచి యున్నట్టి భార్యను నిలువు కనులు
వేసుకొని స్థాణువై యున్న వేల్పురేని
కనియె గౌతము డపుడు దుఃఖమ్ము మీర.

అంత ముని పాద పద్మాల చెంత నెరగి
మనసు తల్లడ మందగా కనులు దుఃఖ
వార్ధులై పొంగి పొరలగ వాసవుండు
ముని వరేణ్యుని తోడ నిట్లనియె నపుడు.

వచ్చితి నర్ధరాత్రమున స్వామి మదాంధత కాముకుండనై
చొచ్చితి మీ కుటీరమున చోద్యముగా తమ రూపుతోడనే
గ్రచ్చర మీదు భార్య కరకంజము బట్టితి నంత నామెకున్
ఎచ్చటి జ్ఞానమో! మది గ్రహించెను నన్ను సురేంద్రు కాముకున్.

తెలిసి యాతల్లి పలికెను దేవదేవ
పద్మనాభా హరి నాదు పతిని దప్ప
పరుని మనమున దలచని భామనేని
శిలను నను జేయుమని యిట్లు నిలచె స్వామి.

భ : ఆర్యులారా! ఇంద్రుడు గౌతముని ఆశ్రమానికి వెళ్ళాడు. అర్ధరాత్రి కోడియై కూశాడు. తెల్లవారు తున్నదని తలచి, గౌతముడు నదికి స్నానానికి వెళ్ళాడు. ఇంద్రుడు అహల్య చేయి పట్టుకున్నాడు. ఆమెకు భగవత్ప్రేరణతో ఆత్మజ్ఞానం కలిగింది. పరమ సాధ్వి, పతివ్రతామతల్లి అయిన ఆమెకు దివ్యదృష్టి సమకూరింది. ఆమె జగన్నాయకుడైన శ్రీహరిని ప్రార్థించి శిలయైంది. తరువాత కథ -

అని పలికి వలవల నేడ్చుచూ 'కాముకుండనై మీ కాపురమునకు చిచ్చు బెట్టితి, మీ భార్య బండయై పడియుండుటకు కారణంబైన నా దుష్కృతికి నిష్కృతి లేదు. నా పాపమున కే శాపమిచ్చినను తప్పు లేదు' అను నింద్రుం గాంచి యమ్ముని శ్రేష్ఠుండు జరిగిన దాని నంతయున్నెరిగి యిట్లనియె :

పెరవారి భార్య జోలికి
నరిగిన నీ దేహమున సహస్రము యోనుల్
పరగెడు గాత శచీ సుం
దరి పరులను జేరు గాత ధరలో పాపీ.

ఇవ్విధంబున గౌతముడు శపించె. అంత త్రేతాయుగంబున

స్వామి హరి రామచంద్రుడై జగతి వెలసి
రాతి నాతిగ జేసె నా రామ యాత్మ
జ్యోతి వైకుంఠమున కేగె సురలు మురిసి
సచ్చరిత్రను స్వామిని మెచ్చి చూడ.

పె : ఇంద్రుడు కామంతో కన్నులు గానక చేసిన పనికి పశ్చాత్తాప పడుతున్నాడు. చేసిన పాపం అనుభవించకుండా తీరదు గనుక, మహర్షియైన

గౌతముడు - 'ఓరీ పాపీ! నీవు చేసిన పాపానికి నీ శరీరంపై సహస్ర యోనులు ఏర్పడతాయ్. నీ భార్య శచీదేవి భూమిపై పుట్టి, పరాయివారి సాహచర్యంతో జీవిస్తుంది' అని శాప మిచ్చాడు.

ఆ తరువాత త్రేతాయుగంలో శ్రీ మహావిష్ణువు శ్రీరామచంద్రుని అవతారమెత్తి రాయిగా పడియున్న అహల్యను నాతిగా చేశాడు. అహల్య స్వస్వరూపం పొందింది. అంత ఆమె ఆత్మజ్యోతి వైకుంఠం చేరింది.

తి : అహల్య వృత్తాంతాన్ని అద్భుతంగా, అపూర్వంగా చెప్పారు.

కృ : అయ్యలరాజు రామభద్ర కవీశా! మల్లన కవీంద్రా! మీరిర్వురూ వాలి వధ కథావిశేషాన్ని ఆశువుగా పురాణంగా చెప్పండి.

మా : ప్రారంభించండి రామభద్ర కవీ!

అ : వినండి మహారాజా!

బారులు తీరి ఖిన్నవదనులై నిలచియున్న కీశ నివహంబును, అరదంబునకు ముందు శోక సంతప్త ముఖులైయున్న సుగ్రీవాంగద జాంబవంతాది ప్రముఖులను, పూచిన యశోక వృక్షంబువలె తేరుపై బడియున్న వాలి కాయంబును, చిన్నవోయిన ముఖారవిందములతో చిత్తరువుల వలె నిలచియున్న రామలక్ష్మణులను, వాలి దార తార అశ్రువులతో నిండియున్న కన్నులతో గాంచి, జరిగినదంతయూ గ్రహించి, యుద్విగ్న చిత్తయై, రామునితో నిట్లనియె:

తాలిమి తండ్రి మాట జవదాటగ నేరక ధర్మ దీక్షతో
శ్రీలదొరంగి రాజ్యము ద్యజించి వనమ్మున నుండి కూర్మియి
ల్లాలిని గోలుపోయి యకటా కడు దుఃఖము తోడ గ్రుగ్గు నీ
వేల మదీయ భర్త వధకిట్టుల బూనితి వయ్య రాఘవా!

ఎరిగితి మారుతి నీకున్
గరపిన పాఠముల వలన కలుషిత బుద్ధిన్
నరపతి ధర్మము న్యాయము
మరచి చరించితివి నీతి మాలితి వకటా!

నాభర్త వాలి, తన తమ్ముడైన సుగ్రీవుని రాజ్యమును హరియించె ననియు, నతని భార్యయైన రుమను చెరబట్టె ననియు, పవనసుతుడు నీకు చెప్పి యుండవచ్చు. అంతియేకాక, నీ భార్యయగు జానకి నన్వేషించుటలో సహాయ మొనర్తుమని సుగ్రీవుడూ, ఆంజనేయుడూ నీకు వాగ్దానము జేసి యుండవచ్చు. ఇట్టి చెప్పుడు మాటలను నమ్మి, ప్రలోభంబుతో యదార్థ మును విచారించక, నా భర్తను పరిమార్చుట నీవంటి క్షత్రియ కుల సంజాతునకు తగని పని.

ఏల నా స్వామి తన తమ్ముడేలు నట్టి
ధరణి హరియించి యాతని దారయైన
రుమను చెరబట్టెనో యొక్క నిముషమైన
యోచన నొనర్చి తెలియంగ తోచలేదె.

బలము చాలక వైరిని గెలువలేక
పందలై ఋష్య మూకాన బరుగునట్టి
వారి యాశ్రయమునొ్ంది భార్య జాడ
నెరుగ దలచిన నీకెట్టు లెరుక పొదము?

సకల రాక్షస సంఘ జలదంబునకు వాయు
సముడైన నా పతిన్ జంపనేల?
అరిలోక తిమిరాళి కరుణ మార్తాండుడై
ఎనగు స్వామిని వధియించనేల?
ధర్మమ్ము తప్పక తన రాజ్య ప్రజలను
మనుపు నా రాజును దునుమనేల?
తపముచే వజ్రిని దర్శించి వరమును
గొన్న నా నాథుని గూల్చనేల?

వాని బిలిపించి యాతని వాక్కులోని
సత్యము నెరింగి నాకిట్టి సాయ మీవు
చేయు మన జానకిన్ దెచ్చి యీయకున్నె
మూడు లోకాలలోన నే మూలనున్న.

అని బోరున విలపించుచూ 'నీతినీ, రాజ ధర్మమునూ విడనాడి నా భర్తను చెట్టు చాటున నుండి చంపిన నీవు రాక్షసులకన్ననూ హీనాతి హీనుండవు. నాకెట్టుల దుస్సహంబగు భర్త వియోగంబు కలిగెనో అట్టులే నీకునూ భార్యా వియోగంబు కలుగు'నని పలికి తార మూర్ఛిల్లె.

మా : శ్రీ రామచంద్రునితో యుద్ధంచేసి మరణించిన వాలిని సుగ్రీవుడు, అంగదుడు మొదలైన వానర వీరులు రథముపై తీసుకొని వచ్చారు. వారి వెంట రామలక్ష్మణులు కూడా వచ్చారు. వాలి భార్య తార దుఃఖంతో రాముణ్ణి అనేక విధాల నిందించి, అనేక రకాలుగా ప్రశ్నించి, క్రోధంతో 'నాకేవిధంగా అయితే భర్త వియోగం సంభవించిందో నీకూ అదేవిధంగా భార్యావియోగం కలుగుతుం'దని శపించింది.

తరువాత కథ - అంత నంగదుడు తల్లి దరిజేరి ఆమెను సేద దేర్చి అనునయంబుగా నిట్లనియె:

తల్లి దుఃఖించకమ్మ నా తండ్రి కెటుల
ధరణిపతితోడ ఘోర యుద్ధంబు సంఘ
టిల్లెనో వారు శౌర్యము పెల్లుమీర
సమరరంగాన పోరికో జనని వినుము.

నిన్న నుషోదయ సమయంబున, వ్యాయామంబునూ, ప్రాతఃకాల సూర్యోపాసన కార్యక్రమంబును నెరప సమకట్టిన పితృదేవులు ఆకాశ మార్గంబున హిమవత్పర్వతంబునకుం జని, గంగోత్రి దాపున నున్న శివ పార్వతుల బూజించి, యటనుండి కన్యాకుమారి కేతెంచి, దక్షిణ సముద్రంబున సూర్యోపాసన నొనర్చి మరలివచ్చుతరి, రాము డొక్క బాణంబున నా తండ్రి కంఠసీమ నలంకరించిన మాలను రెండు తునియలై వనధిబడు నట్లొనరించె. అంత కుపితుడైన నా జనకుడు, ఋష్యమూక పర్వతముపైనున్న రాముని గాంచి, సత్వరంబే వాని దరికి వచ్చి యొక పర్వత శిఖర భాగంబును బెకలించి వానిపై వైచె. దానిని చెట్టు చాటున నుండి గమనించుచున్న నరపతి, దివ్యాస్త్రములను సమీకరించుకొని, వానర పతి నెదుర్కొనియె.

'చెట్టు చాటున నుండి బ్రతికిపోయితి'వని నా తండ్రి పలికిన వాక్కులు దశ దిశల బ్రతిధ్వనించె. అంత రాళ్ళ వర్షమును గురి పించుచూ, గదలను విసరుచూ, నలుదిశలు చీకట్లు గ్రమ్మునట్లు చేయు చున్న కీశపతి పరాక్రమ విజృంభణమునకు నెదురు నిలిచి, శ్రీరామ చంద్రుడు శాత శరంబుల నెక్కిడి, రాళ్ళను బొడిచేసి, గదలను విరచి వైచె. అటుల బాణములతో రాముడునూ, గదలతో, పర్వత శకలము లతో నా తండ్రియూ, ఒక పవలునూ మరియు నొక రాత్రంబునూ, నిర్వి రామంబుగా సంగ్రామ మొనర్చిరి. అట్టి యుద్ధమును లక్ష్మణుడునూ, సుగ్రీవ హనుమంత జాంబవంతాదులునూ, నేనునూ, మన వానరవీరులునూ, చూచుచూ మహదానందము నొందితిమి. శ్రీరాముడు తుట్టతుదకు నారాయ ణాస్త్రమును సంధించి, నా తండ్రిని మట్టుబెట్టె. అట్టి యుద్ధమును చూచిన సురులు, ఆకాశము నుండి కుసుమ వర్షమును గురియించిరని పలికిన యంగదుని మాటలకు తార హర్షబాష్పాకులితనేత్రయై పులకించె

అంత రవికులేశుడు—

సాధ్వీ నా మాట నమ్ముము సత్యమిద్ది
దక్షిణాంభోధి దరినుండి తరలివచ్చు
వాలియొక సూర్యబింబమై వరలె వాని
కంఠహారమ్ము చంద్రుడై కానిపించె.

ఇట్టి వింతను రాక్షసుల మాయోపాయంబుగా భావించిన నేను శరంబును సంధించి వైచితి. అది నీ భర్త గళముననున్న మాలను తునియ లొనర్చె. ఇదియే నేను నీ భర్త కొనర్చిన యపకారము.

ఆంజనేయుడు వచించిన దానికి, నేను, నీ భర్తను బిలిపించి, విషయమును విచారింతునని మాట యిచ్చితిని. అది యట్టుల జరుగక మున్నే, యిట్టి సంఘటన సంభవించి, నీ భర్త కోపోద్రిక్తుడై నాతోడ భయంకరమైన రణమొనర్చి వీర మరణంబు నొందె. నీ కొడుకును

యువరాజుగాను, నీ మరదియైన సుగ్రీవుని రాజుగానూ, మీ రాజ్యమున నియమించుట నా ధర్మమని యిటకు వచ్చితి.

అని వచియించు రాముని ముఖారవిందమును గాంచిన తార_

కనియె నీరదసమ గాత్రు కంజనేత్రు
దివ్య జాంబూ నదాంబరధృతశరీరు
శంఖ చక్ర గదా పద్మ సహిత హస్తు
శ్రీరమామణి హృదయరాజీవమిత్రు.

ఇట్లు శ్రీరామచంద్రుని శ్రీమన్నారాయణునిగా నెరింగిన తార, దుఃఖమ్ము వీడి కరకమలములు మోడ్చి, జానకీపతికి నమస్కరించె.

అ : దుఃఖిస్తున్న తారతో, రాముడికీ వాలికీ యుద్ధం ఏ విధంగా జరిగిందో, వివరించి చెప్పాడు అంగదుడు. వాలి వీర విహారాన్ని గురించి విన్న తారకు దుఃఖం కొంత ఉపశమించింది. అప్పుడు రాముడు, తనకూ వాలికీ యుద్ధం యెందుకు సంభవించిందో వివరించి చెప్పాడు. అంత తార, శ్రీరామచంద్రుడు శ్రీమహావిష్ణువు అవతారమని గ్రహించి, నమస్కరించింది.

తి : ఇదియొక అపూర్వమైన కథ - మహదానందంగా చెప్పారు.

కృ : తిమ్మన సుకవీ! సూరన కవి వరేణ్యా! మీరిరువురూ బృహస్పతి భార్యయైన తార వృత్తాంతాన్ని రసమయంగా ఆశువుగా పురాణంగా చెప్పండి.

పిం : ప్రారంభించండి తిమ్మన కవీంద్రా!

నం : వినండి కృష్ణరాయా!

అంత నా దేవగురువైన బృహస్పతి బ్రహ్మలోకము జేరి -

వారిజాసన నేను నా భార్యయైన
తారనున్ జంపినాడ క్రోధమ్ముతోడ
నరిది స్త్రీ హాతి ననఘ నా శిరము వేయి
వ్రక్క లగుచున్న దని పల్కె వ్యధితుడగుచు.

అంత నా నీరజాసనుండు 'నాయనా! చింతింపకుము. వేదముల నన్నింటినీ సాంగో పాంగముగా చదువుకున్నవాడవు. నీవు దుఃఖించుట భావ్యము కాదు. జరిగినదేమి? నీ భార్య నెందులకు జంపితివి?' అని ప్రశ్నింప గురువిట్లనియె :

నిరతమ్ము శ్రుతులను పరవశమ్మున పాడు
కొనుచుంటినయ్య పావన చరిత్ర!
అనుదినమ్మును నేను హవ్య కవ్యాదుల
నగ్నిహోత్రుని గొల్చితాదిదేవ!
విడకుండ విద్యార్థి బుడతల కెప్పుడు
పాఠముల్ చెప్పితి వాణినాథ!
సురరాజు కొలువులో పరిపరి మంత్రాంగ
కార్యముల్ నెరపితి కమలగర్భ!

ఇంట నా భార్యతోడ నొకించుకేని
సరసమాడగ లేదు నా సతికి ముద్దు
మురిపెమును దీర్చనైతి నేప్రొద్దు నేను
గంగిరెద్దయి బ్రతికితి ఘనుడ ననుచు

నా లలనాశిరోమణి యనంగుని బాధకు తాళలేక నం
దాలను చిందు చందురుని దానెను కౌగిట గ్రుచ్చనెంచి యా
బాలుడు నాదు శిష్యుడు కృపన్ నను వీడుము నీవు గుర్వు కి
ల్లాలవు నిన్ను కూడ తగదమ్మ యనెన్ కడు భద్రమూర్తియై.

పట్టు విడదయ్యె నా భార్య యెట్టులైన
వాని పొందును పొందగా పూని వాని
పైబడియె కట్టుకొనియెను వాడు నన్ను
చేరి యిది చెప్పి ఏడ్చెను బోరుమనుచు.

పిం : దేవ గురువైన బృహస్పతి బ్రహ్మలోకం చేరి - 'నేను నా భార్యయైన తారను క్రోధంతో చంపాను. ఆ బాధతో నా తల వ్రక్కలవుతున్నది'

అని బ్రహ్మతో మొర పెట్టుకున్నాడు. అది విన్న బ్రహ్మదేవుడు ఏం జరిగిందో సావధానంగా చెప్పమన్నాడు.

అంత బృహస్పతి-'అయ్యా! నేను ప్రతినిత్యమూ వేదపారాయణ, అగ్నిహోత్రము చేసుకుంటూ, విద్యార్థులకు చదువు చెప్పుకుంటూ, దేవేంద్రుని కొల్వులో రాచ కార్యాలను నిర్వర్తిస్తూ, నా భార్య ముద్దూ, ముచ్చట తీర్చలేదు. అందువల్ల, ఆమె చంద్రునిపై మక్కువ పెంచుకొన్నది. వానిపైబడి బలాత్కారంగా కట్టుకొన్నది. నా శిష్యుడైన చంద్రుడు, ఆమె చేసిన బలవంతమును నాతో చెప్పి,బోరుమని ఏడ్చాడు' అని జరిగినదానిని వివరంగా చెప్పాడు. ఆ తరువాత కథ—

తారా యిటు చేసితివా
నేరమ్మిది కాద యనుచు నే గర్జింపన్.
ఆ రమణి పల్కె వాడే
మారుని క్రీడకును కోరె మత్తుండగుచున్.

అని పల్కి, పరి పరి విధంబుల నంగ మచ్చములను, అనంగుని పోడిములను చూపించు నా తార మాయలకు మండిపడి నే నామెను సమయించితిని. ఆమె మృతయైన తక్షణంబే నా హృదయ కవాటంబు తెరచుకొనియె. ఇది యంతయూ నా తప్పు. నేను, దేవకార్యభారనిర్వహణుండనై,యింటగల నా యిల్లాలి ననాదరంబు సేసితి. రస విహీనము, అర్థరహితము అయిన జీవితంబు గడిపితి. ఆ కారణంబున, నా భార్య యట్టుల చేసె. నే క్రోధినై,నా ధర్మపత్ని మరణంబునకు కారణంబైతి. పాపమున కొడిగట్టుకొంటి అని శోకించుచున్న బృహస్పతికి బ్రహ్మ యిట్లనియె:

ఇల క్రోధము సర్వ వ్యా
కులములకును మూలమట్టి కోపము చేతన్
కల బుద్ధినాశమగు ని
ర్మల మతివయి వినుము నాదు మాటలు వత్సా.

ఈ వేషము నీ గడ్డము
నే వనితకు నచ్చు నీవు నిట్టుల వగచన్
గావలదు తార నిపుడే
జీవింపగ జేతు నిక వసించుము సుఖివై.

అని తారన్ సజీవగా జేసి, యామె బుద్ధిన్ గల కామము నుడిగించి, 'తారా! నీవు గర్భవతివిగా నుంటివి. నీ గర్భస్థ శిశువు గురువు వలననా? లేక శీతకరుని వలననా?' యని ప్రశ్నింప, నామె వెరగంది వలవల నేడ్చుచు 'నా భర్తను కలియక ఎన్ని వత్సరంబులో అయినది; చంద్రుని కోరితినేగాని పొందలేదు. కోరికచేతనే పిల్లలు కలుగుదురా?' అని బ్రహ్మను ప్రశ్నింప, ఆమె మాటలను విని నిజంబు తెలిసిన దేవగురువు ఆనందించె.

అంత బ్రహ్మ 'అమ్మా! నీవు గర్భవతివి గావు. నీచే నిజంబు బలికింప నే నట్లాడితిని. నా వరంబున మీకు బుధుడను పేర ప్రసిద్ధుం డగు పుత్రుండు పుట్టు'నని చెప్పి మరియును—

అనఘ! విను గృహస్థునకున్
తన వృత్తియు నింటిలోని తన వారలతోన్
మనుటయు రెండును ధర్మము
లని చెప్పుచు మందలించె నా తార కనన్.

అంత దేవగురువు బ్రహ్మదేవునకు నమస్కరించి, సజీవయైన భార్యను తారన్‌గొని, ఆ దేవుని వరంబున దివ్యతేజంబు నంది, ప్రేమతో నాత డొసగిన యమృతము నాస్వాదించి, యానందంబున తన నిల యంబునకున్ జనియె.

న : 'నా భార్యను నేను దండించ బోయినాను. ఆమె నేనేం చేయలేదు, వాడే చేశాడని లేనిపోని కల్పనలన్నీ చేసి చెప్పింది. దానివల్ల నాకు కోపంవచ్చి, తారను చంపాను. తరువాత నాలోని తప్పను నేను తెలుసుకున్నాను' అని శోకిస్తున్న బృహస్పతిని ఓదార్చి, 'కోపము అన్నివిధాలా నాశనమై పోవటానికి మూలము. గృహస్థుడైనవాడు తన వృత్తిధర్మంతోపాటు

ఆలుబిడ్డల విషయంలో కూడా తగిన శ్రద్ధ వహించాలి' అని హిత వచనాలు చెప్పి, కరుణతో తారను బ్రతికించి, దేవ గురువునకు ఆనం దాన్ని కూర్చాడు బ్రహ్మ.

తి : రనవత్తరమైన పురాణమును రమ్యముగా జెప్పుటలో మీకు మీరే సాటి యనిపించుకున్నారు.

కృ : ధూర్జటి కవీంద్రా! తెనాలి రామలింగ కవీశా!

బలిచక్రవర్తి వామనమూర్తిచే నిహతుడయిన తరువాత, బలి చక్రవర్తి భార్యయైన వింధ్యావళికినీ, వామనమూర్తికినీ జరిగిన సంవాదాన్ని మనోజ్ఞమైన పురాణంగా ఆశువుగా చెప్పండి.

తె : ప్రారంభించండి ధూర్జటి కవీశా!

ధూ : వినండి మాహారాజా!

ఒక పాదముతో భూభాగమును, వేరొక పాదముతో విశ్వాంత రాళమును ఆక్రమించి, మూడవ పాదమును బలి శీర్షముపైనుంచి, విశ్వ రూప ప్రదర్శనంబొనర్చి, దేవదానవులు విస్మయమంద, బలిని పాతాళ మున కణచి సంహరించి క్రమ్మర వామన రూపంబు పొందిన వామనునితో వింధ్యావళి యిట్లనియె:

అడిగెను యాచకుండనుచు నార్యుడు నీకిడె ధర్మబుద్ధితో
నడుగులు మూడు నీ యఘము నాతడెరుంగడు నీవు వెట్టిగాన్
పుడమి నభోంతరమ్ములను బొందిన యంతనె నాదు బుద్ధిలోన్
వడుగ నినున్ గ్రహించితిని వాసవు సోదరు మారు రూపుగాన్

తిన్న యింటను వాసాల నన్ని లెక్క
బెట్టుకొనువాడ వీవు నీ పొట్ట చూచి
పట్టెడన్నము బెట్టిన వాని చేయి
నరుకువాడవు దుర్మార్గ హరివి నీవు.

అరి మన స్వర్గ పీఠమునకై యొనరించును యజ్ఞమంచు లో
నెరిగిటు వచ్చినావు హరి నీకును వేల్పుల రాజుకున్ నిజం
బరయగ యుద్ధరంగమున నా బలి గెల్వగ శక్తి లేదు నే
నెరుగుదు మాయదప్ప నిక నేమియు చేయగ లేవటంచు నిన్.

అని దుఃఖాకుల చిత్తయై కనుము నా యాత్మేశ్వరున్ జంపి నా
జననమ్మున్ వృధ జేసి తీవు భువిలో సంతోష హీనుండవై
వనితారత్నము గోలుపోయి వ్యధితవ్యావృత్త చిత్తంబుతో
మను మానాడు తలంచు మానినిటులన్ మాటాడెనంచున్ మదిన్.

తె : భర్తను పాతాళానికి త్రొక్కిన వామనునితో వింధ్యావళి ఈ విధంగా చెప్పింది:

'నా భర్త ధర్మ బుద్ధితో నీ వడిగిన మూడడుగులూ ఇచ్చాడు.నీవు బ్రహ్మాండాన్నంతా రెండు పాదాలతో ఆక్రమించిన వెంటనే నాకు తెలిసిపోయింది. ఏమని - నీవు ఇంద్రుని మేలు కోరే విష్ణువువు అని. నీవూ, ఇంద్రుడూ నిజంగా యుద్ధరంగంలో నా భర్తను గెలువలేరు. అందుకే నీవు ఈ రకంగా మాయోపాయం చేత నా భర్తను చంపావు' అని, అనేక దుర్భాషలాడి తుదకు ఈ విధంగా శాప మిచ్చింది:

'నా భర్తను చంపి నాకు తీరని అన్యాయం చేశావు.నీవు భూమిపై పుట్టి, భార్యను కోల్పోయి, నాలాగే దుఃఖాన్ని అనుభవించు' అని. ఈ శాపం కారణంగానే శ్రీ మహా విష్ణువు, శ్రీరామచంద్రమూర్తి అవతార మెత్తినప్పుడు సీతను కోల్పోవటం జరిగింది.

(ధూర్జటి వైపు తిరిగి) ఘట్టాన్ని రసవత్తరంగా చెప్పి కనీ తీర్చుకున్నావయ్యా ధూర్జటీ! తరువాత కథ నే చెబుతాను.

అంత నా మాయా వటు విట్లనియె:

అమ్మ శాంతించి నా మాట లాలకించు
నీదు పతి సేయు యజ్ఞము నిక్కువముగ
స్వర్గ పీఠమునకె యైన సరసిజాక్షి
అందు దొసగేమి గలదు, సత్యంబు వినుము.

హరులో కరులో సిరులో
సుర రాజ్యమొ కోరవచ్చు సుదతీ యెవడున్
పరు భార్య కోరదగదది
మరణమునకు హేతువగును మానిని వినుమా.

బలి తలపున శ్రీలక్ష్మిన్
నిలిపెను తన వాంఛదీర నేడీ యజ్ఞం
బలఘు గతి సేయు ఋత్వి
క్కులకును మరుమాట చెప్పు కులసతి వింటే.

'దేవ దానవులు సుధగోరి సముద్ర మథనంబు జేసినప్పుడు జని యించిన వార్ధి కన్యను రాక్షసులు కోరిరి. కానీ, యవ్వరారోహ, క్రియా శీలుండనై మంథర గిరి పర్వతంబును మోసిన, నాపై మరులు కొనియె. నన్నే ప్రేమించె. అందుచే నే నామెను పాణిగ్రహణం బొనర్చితి. ఆ సమయమున రాక్షసులు - 'లక్ష్మిని, జగదేక సుందరిని, నీవు గొంటివి. అందువలన నమృతము నసురుల కిచ్చుట ధర్మమ'ని పట్టుబట్టిరి. రాక్షసు లందరూ, మదోన్మత్తులై, తమ పంతమును నెగ్గించుకొన బ్రయత్నించిరి. అట్టి తరి, వారి శఠత్వముపై గల కోపమున మార్గాంతరము లేక, మాయో పాయమున రాక్షసులకు సురయు, దేవతలకు సుధయూ పంచి యిచ్చితి. ఆనాటి నుండియూ ఈనాటి వరకునూ అసురులకు నేనన్న పరమ ద్వేషంబు గలదు. నా భార్య యన్న విపరీత వ్యామోహంబు గలదు. నీ భర్త దేవలోకాధిపత్యమునకే కాక, నా భార్యను పొందు దుర్బుద్ధితో యజ్ఞము చేయుచుంటచే, నేను వానిని సమయించితిని' అని పల్కిన వడుగున్గాంచి వింధ్యావళి యిట్లనియె:

పతి మరణింప దుఃఖమున పల్కితి నెన్నియొ శాప వాక్కులన్
సతిని క్షమింపు మయ్య బుధసన్నుత దీనను భర్త దుష్ట భా
వతతియె నాశ హేతువని పల్కిన నీ పలు కాలకించితిన్
అతులితమైన నీ కరుణ నంతము చేయుము నన్ను మాధవా!

అని బోరున విలపించెడు
వనితారత్నమ్ము తెరగు వారిజనేత్రుం
దనుపమ కరుణాదృష్టిన్
కనుగొని దుఃఖమ్ము విడుము కంజదళాక్షి.

అని పల్కి, ఆ యజ్ఞవాటికలోని జనులెల్లరూ విస్మయమంది చూచుచుండ, నామె నొక దివ్యజ్యోతిగా జేసి యమ్మాయా వటువైన మహా విష్ణువు తనలో లీనంబు గావించుకొనియె.

ధూ : అప్పుడు వామన రూపంలో నున్న శ్రీమహావిష్ణువు ఈవిధంగా చెప్పాడు: 'నీ భర్త యజ్ఞము కేవలం స్వర్గ రాజ్య పదవి కొరకే చెయ్యటం లేదు. నేను నిజం చెబుతున్నాను విను. నా భార్యయైన లక్ష్మీదేవిని కోరి చేస్తున్నాడు. ప్రపంచంలో, ఎవడైనా ఏదైనా కోరవచ్చు కానీ, పరాయి వాడి భార్యను కోరకూడదు. అది వాడి ప్రాణానికి ముప్పు తెస్తుంది. రాక్షసులలో కొందరికి లక్ష్మీదేవిపై వ్యామోహం, సముద్రం నుండీ ఆమె పుట్టిన నాటినుండీ, ఉంది. కానీ ఆమె నన్నే ప్రేమించి యుండటం వలన నేను పెండ్లి చేసుకొన్నాను. సముద్ర మథన సమయంలో, రాక్షసులందరూ 'లక్ష్మని నీవు తీసుకున్నావు గనుక, అమృతాన్ని మాకీయ వలసిందని పట్టుబట్టారు. నేను అందరం కలిసి త్రాగుదామంటే వినలేదు. నేను, వారి మీద కోపంతో మాయచేసి, అమృతాన్ని దేవతలకు, సురను రాక్షసులకూ అందజేశాను. ఆనాటి నుండీ రాక్షసులకు నాపై కోపం ఉంది. లక్ష్మిపై వ్యామోహముంది అని మాయా వటువు వివరించి చెప్పాడు.

అంతట బలి భార్యయైన వింధ్యావళి శోకిస్తూ 'క్షమించమని' విష్ణువును కోరింది. వటువు రూపంలో నున్న శ్రీ మహావిష్ణువు ఆమెకు మోక్షం ప్రసాదించాడు. ఆమె యాత్మజ్యోతిని తనలో లీనం చేసుకున్నాడు.

తి : మీరు చెప్పిన పురాణము అనుపమానము. ఇంత మధురమైన కల్పన నొనర్చిన మీ కవితాశక్తి యద్భుతము.

కృ : సభ్యులారా! సాహితీ ప్రియులారా! ఈనాడు మీరు వినిన సంగీత సాహిత్యములు అమృతోపమానమైనవి. ఇంతటి మధురమైన కవిత్వమును నుడివి అవధాన మొనర్చిన మన యాస్థాన మండలి యష్ట దిగ్గజముల పాండితీప్రకర్ష నభూతో న భవిష్యతి. ఈనాటి రసమయ ప్రసంగమున విదితమైన మహా కవుల జీవిత గాథలు అద్భుతమైనవి. వారి భక్తి యపారము. ఇట్టి భాగవతోత్తములను కలిగిన మన యాస్థానము ధన్యమైనది. ఈనాడు మన కవులు నుడివిన పురాణ గాథలు చిత్ర విచిత్రములుగా నున్నవి. ఇవి వారి కల్పనా శక్తికి నికషోపలములు. ఈ గాథలు యధార్థములా, అయథార్థములా అను మీమాంసను వదలి, ఆ కథలు సూచించు పరమార్థమును గ్రహించి ఆనందింతము. విశ్వ కళ్యాణమునకు మన కవులు ప్రబోధించిన యుపాఖ్యానములూ, నీతులూ మన జాతికి చిరస్మరణీయములై యలరారునని నేను తలంచుచున్నాను. జంటలు జంటలుగా నేర్పడి ఆశు కవిత,పురాణము చెప్పిన మన కవుల సంవిధానము, భావితరముల వారికాదర్శమై, అనేక మహాకవులు జంట కవులుగా కవిత్వము చెప్పెదరని,అవధానమొనర్చెదరని తలంచుచున్నాను. ఈ సాహిత్య సభను ముగింప ఆంధ్ర కవితా పితామహుడైన అల్లసాని పెద్దన కవీంద్రుని కోరుచున్నాను.

పె : సోదర సోదరీమణులారా! మీలో ఎందరో ఈ రాత్రి తెలవారక మున్నే తిరుపతిలో జరుగనున్న శ్రీ వేంకటేశ్వరుని బ్రహ్మోత్సవములను చూచుటకు, కుటుంబ సమేతముగా తిరుపతి కేగుటకు సంసిద్ధముగా నున్నారు. అట్టి తొందరలో మీరున్ననూ, ఇట్టి సాహిత్య గోష్ఠికి విచ్చేసి, వీనుల విందగు కవితను విని యానందించిన మీ సాహితీ పిపాసకు మిమ్ముల నభినందించు చున్నాను. మీ కందరకూ ఆయురారోగ్య ఐశ్వర్యములు ప్రసాదింప శ్రీ వేంకటేశ్వరుని ప్రార్థించుచున్నాను.

కులమత జాతి విభేదములను విస్మరించి, హెచ్చు తగ్గులను విడనాడి, జనులందరూ మన రాజ్యమున ధర్మ రక్షణకు పాటుపడ గలందులకు తగిన బుద్దినీ ఆత్మశక్తినీ మనకందరకూ ఒసగ శ్రీ వేంకటేశ్వరుని త్రికరణశుద్ధిగా నర్థించుచున్నాను.

తమ లీల జీవ జాతమును సృజించు బ్ర
హ్మకు వాణికిని భవ్య మంగళమ్ము
కరుణతో లోకాల గాచెడు శ్రీదేవి
మాధవులకు దివ్య మంగళమ్ము
అఖిల లోకమ్ముల హరియింపగల సర్వ
మంగళ శివులకు మంగళమ్ము
తమ్ముల తోడ సీతమ్మతో కొలువైన
మహారాజ రామయ్య మంగళమ్ము

ఏడుకొండల పైన నిజేచ్ఛ లోక
మేలు పద్మావతీ యలిమేలు మంగ
సహితుడా వేంకటేశ్వరస్వామి నీకు
మంగళము దీన మందార మంగళమ్ము.

(తెర పడును.)

సమాప్తం

# కావ్యరచనకు ఆధారమైన గ్రంథాలు


1. ఆరుద్ర — సమగ్ర ఆంధ్ర సాహిత్యం, ఏడ సంపుటం, మలి రాయల యుగ (1965), యం. శేషాచలం అండ్ కంపెే మద్రాసు, మచిలీపట్టణం, సికింద్రాబా

2. ఆచార్య దివాకర్ల వెంకటావధాని మరియు నితరులు — చైతన్య లహరి (ఉపన్యాస మంజరి (1972), యువభారతి, సాహితీ సాంస్కృతిక సంస్థ, 5 కింగ్స్‌వే, సికింద్రాబాద్-

3. విద్వాన్ గంటి జోగి సోమయాజి — ప్రాచీన కావ్య మంజరి (1966), వి లాంధ్ర ప్రచురణాలయం, విజయవా

4. బి. సీతారామాచార్యులు — శబ్ద రత్నాకరము. అకారాది ఆం నిఘంటువు, (1988), ఏషియన్ ఎడ కేషనల్ సర్వీసెస్, C-2/15, S.D.A న్యూఢిల్లీ - 110 016.

5. శ్రీకృష్ణదాస జయదేవ కవి — శ్రీ గీతగోవింద కావ్యము [అష్ట పదులు కొండపల్లి వీర వెంకయ్య అండ్ సన్, శ్రీ సత్యనారాయణ బుక్‌డిపో, రా మండ్రి (1958).


